Haqeeqat-e-Zakaat
Khutbaat-IV
(Telugu)

# జకాత్ వాస్తవికత

ఉర్దూ మూలం:
మౌలానా మౌదూది

అనువాదం:
ఎస్.ఎమ్. ఖాద్రి

# విషయ సూచిక

అనంతకరుణామయుడు అపార కృపాశీలుడయిన అల్లాహ్ పేరుతో

# జకాత్

ముస్లిమ్ సోదరులారా! నమాజ్ తరువాత ఇస్లామ్ ధర్మంలో గొప్ప మూలస్తంభం జకాత్. సాధారణంగా, ఆరాధనా విషయంలో, నమాజు తరువాత రోజా ప్రస్తావన వస్తూ ఉంటుంది గనక, నమాజు తరువాత రోజాకే ప్రాధాన్యం ఇవ్వడం జరిగింది అని అనుకుంటారు జనం. కాని దివ్య ఖుర్ఆన్ ద్వారా మనకు తెలిసేదేమంటే ఇస్లామ్‌లో నమాజు తరువాత జకాత్‌కే ప్రాముఖ్యత ఉంది. ఈ రెండూ పెద్ద స్తంభాలే. వీటిపైన్నే ఇస్లామ్ కట్టడం నిలబడి ఉంది. అవి తమ స్థానం నుండి కదిలితే ఇస్లామ్ కట్టడం నిలబడజాలదు.

జకాత్ అంటే పవిత్రత, పరిశుద్ధత అని అర్థం. తన సంపద నుండి ఓ భాగం, అగత్యపరులకు పేదవారికి కేటాయించడాన్ని జకాత్ అని ఎందుకు అనవలసివచ్చిందంటే, ఈ విధంగా మనిషి సంపద, దానితో పాటు మనిషి హృదయం కూడా పరిశుద్ధమౌతుంది. దైవదత్తమైన సంపద నుండి దైవదాసుల హక్కును కేటాయించని వ్యక్తి ధనం, ఇంకా అతని మనసు కూడా అపవిత్రమౌతాయి. ఎందుకంటే అతని మనస్సులో కృతఘ్నుతా భావం నిండి ఉంది. అతని హృదయం ఎంతో కఠినమైనది, ఎంతో స్వార్థపూరితమైనది, మరెంతో దురాశాభరితమైనది. అతని అవసరాలను తీర్చుకోవడానికి కావలసిన దానికంటే అధికమైన సంపద అనుగ్రహించి అతనికి దైవం ఎంతో మేలు చేశాడు. చేసిన మేలుకు కృతజ్ఞత తెలుపుకోవడానికి కూడా అతని మనసొప్పదు. ఇలాంటి వ్యక్తి ఏ పుణ్యకార్యమైనా దైవం కోసం ఎలా చేస్తాడు, ఎలా చేయగలడు? తన విశ్వాసం కోసం, తన ధర్మం కోసం ఎలాంటి త్యాగం అయినా ఎలా చేస్తాడు? కాబట్టి ఇలాంటి వ్యక్తి హృదయం అపవిత్రమైందే, అతడు కూడగట్టిన ఆ సంపద కూడా అశుద్ధమైనదే.

అల్లాహ్ జకాత్‌ను విధిగా నియమించి ప్రతివ్యక్తిని ఓ పరీక్షకు గురిచేశాడు. తన అవసరాలకుమించి ఉన్న సొమ్ము నుండి దైవం హక్కును సంతోషంగా కేటాయించే వ్యక్తి ఆయన దాసులను ఆదుకుంటాడు. అతడే నిజమైన అల్లాహ్ సేవకుడు. అతడే విశ్వాసుల సంఘంలో చేరదగ్గ వ్యక్తి. దీనికి భిన్నంగా కఠిన హృదయుడు దైవం కొరకు ఈమాత్రం త్యాగం చేయలేని వ్యక్తి అల్లాహ్‌కు అవసరంలేదు. అలాంటివాడు విశ్వాసుల సంఘంలో చేరడానికి తగడు. అతడు చెడిపోయిన పార్శ్వం. దాన్ని తొలగించడమే సబబు. లేకపోతే అది శరీరం మొత్తాన్నే పనికిరాకుండా చేసేస్తుంది. దైవ ప్రవక్త (సఅసం) దివంగతులైన తరువాత అరేబియాలోని కొన్ని తెగలు జకాత్ చెల్లించడానికి నిరాకరించాయి. ఈ కారణంగానే హజ్రత్ అబూబక్ర్ (ర.అన్) తిరస్కారులతో యుద్ధం చేసినట్లే ఆ తెగలతో యుద్ధం చేశాలు. ఆ తెగలవారు నమాజు చేసేవారు, దైవాన్ని, దైవప్రవక్త (సఅసం)ను విశ్వసించేవారు. ఈ చర్య ద్వారా తెలిసిందేమంటే జకాత్ లేనిదే నమాజుగాని, విశ్వాసంగాని వ్యర్థమైనవే. ఇది లేనిదే దేనికీ విలువలేదు.

దివ్య ఖుర్‌ఆన్ చదివితే, అనాది నుండి దైవ ప్రవక్తల సమాజాలన్నిటికి, నమాజుతో పాటు జకాత్ చెల్లించమని ఆదేశాలు ఇవ్వబడ్డాయన్న విషయం మనకు కనబడుతుంది. దైవధర్మం అయిన ఇస్లామ్ ఏ ప్రవక్త కాలంలోనైనా ఈ రెండు విధులతోనే అందజేయబడింది. హజ్రత్ ఇబ్రాహీం (అ.స) ఆయన సంతతిలో ప్రభవించిన ప్రవక్తల్ని ప్రస్తావించిన తరువాత దివ్య ఖుర్‌ఆన్ ఇలా సెలవిచ్చింది.

> "మా ఆజ్ఞానుసారం మార్గదర్శకత్వం నెరపేవారిని మేము నాయకులుగా చేశాము. మేము వహీ ద్వారా సత్కార్యాలు చెయ్యండి అనీ, నమాజ్‌ను స్థాపించండి అనీ, జకాత్ ఇవ్వండి అనీ వారికి బోధించాము. వారు మమ్మల్ని ఆరాధించేవారు. *(అల్ అంబియా: 73)*

హజ్రత్ ఇస్మాయీల్ (అ.స) గురించి దివ్య గ్రంథంలో ఇలా ఉంది.

> *"అతను తన ఇంటివారిని నమాజు, జకాత్‌లను పాటించండి అని ఆజ్ఞాపించేవాడు. తన ప్రభువునకు ప్రీతిపాత్రుడు. (మర్యమ్: 54)*

హజ్రత్ మూసా (అ.స) తన జాతికోసం దుఆ చేస్తూ, దేవా, మాకు ఇహలోకపు మేళ్ళనూ, పరలోకపు మేళ్ళనూ ప్రసాదించు అని వేడుకోగా, అల్లాహ్ సమాధానంగా ఏమని సెలవిచ్చాడో మీకు తెలుసా? అల్లాహ్ ఇలా అన్నాడు.

> *శిక్షను నేను కోరినవారికి విధిస్తాను. కాని నా కారుణ్యం ప్రతి వస్తువునూ ఆవరించి వుంది. నా పట్ల అవిధేయతకు-దూరంగా ఉండే వారి కొరకూ, జకాత్ ఇచ్చేవారికొరకూ, నా ఆయతులను విశ్వసించేవారి కొరకూ నేను దానిని వ్రాస్తాను. (అల్ ఆరాఫ్ : 156)*

హజ్రత్ మూసా (అ.స) జాతి అల్ప మనస్తత్వంతో డబ్బంటే పడిచచ్చేది. నేటికీ యూదుల పరిస్థితిని మనం గమనిస్తూనే ఉన్నాం. అందుకని అల్లాహ్ తన ప్రవక్త చేసిన పై దుఆకు సమాధానంగా మీ సమాజం గనక జకాత్ వ్యవస్థను తప్పకుండా పాటిస్తూ ఉంటే వారికి నా కారుణ్యం తప్పక లభిస్తుంది. అలా జరగని పక్షంలో, బాగా వినండి, అది నా కారుణ్యానికి దూరం అయి పోతుంది. నా శిక్ష వారిని చుట్టుముడుతుందని స్పష్టంగా చెప్పాడు. కాబట్టి హజ్రత్ మూసా (అ.స) తరువాత కూడా ఇస్రాయీల్ సంతతిని హెచ్చరించడం జరుగుతూ వచ్చింది. మాటిమాటికి వారిచేత అల్లాహ్ తప్ప మరెవ్వరిని ఆరాధించవలదని, నమాజ్ చెయ్యాలని, జకాత్‌ను నియమం తప్పకుండా చెల్లిస్తూ ఉండాలని వాగ్దానాలు చేయించడం జరిగింది. *(అల్‌బఖర)* చివరి దఫాగా వారిని ఇలా హెచ్చరించడమూ జరిగింది.

> *అల్లాహ్ ఇంకా వారితో ఇలా అన్నాడు: "నేను మీతో ఉన్నాను. మీరు గనక నమాజును స్థాపిస్తే, జకాత్ ఇస్తే, నా ప్రవక్తలను విశ్వసించి వారికి తోడ్పడితే, అల్లాహ్‌కు మంచి రుణాన్ని ఇస్తూవుంటే, నమ్మండి! నేను మీలోని చెడుగులను మీనుండి తుడిచివేస్తాను." (అల్ మాయిద : 12)*

అంతిమ దైవప్రవక్త, మహనీయ ముహమ్మద్ (సఅసం)కు పూర్వం వచ్చిన ప్రవక్త హజ్రత్ ఈసా (అ.స). ఆయనకు కూడా అల్లాహ్ నమాజుతో పాటు జకాత్‌ను చెల్లించే ఆదేశాలిచ్చాడు. 'మరియం' సూరాలో ఇలా ఉంది:

*నేను ఎక్కడున్నా సరే, ఆయన నన్ను శుభవంతునిగా చేశాడు. నేను జీవించి ఉన్నంతకాలం నమాజును, జకాతును పాటించు అని ఆజ్ఞాపించాడు. (మర్యమ్ : 31)*

ఆది నుండే ప్రతి దైవప్రవక్త కాలంలో ఇస్లామ్ ధర్మాన్ని నమాజు మరియు జకాత్ అనే రెండు మూలస్తంభాలపై నిలపడం జరిగిందని, ఏ ప్రవక్త కాలంలోను దైవాన్ని విశ్వసించిన ఏ సమాజానికీ ఈ రెండు విధుల నుంచి మాఫీ లభించలేదన్నది స్పష్టమౌతుంది.

అంతిమ దైవప్రవక్త హజ్రత్ ముహమ్మద్ (సఅసం)గారి షరీఅత్‌లో ఈ రెండు విధులు ఒకదాన్ని మరొకటి ఎలా అంటిపెట్టుకొని ఉన్నాయో చూడండి. దైవగ్రంథం అయిన దివ్య ఖుర్‌ఆన్ తెరువగానే మనకంటబడే ఆయత్‌లు ఏమంటున్నాయో గమనించండి.

*ఇది అల్లాహ్ గ్రంథం. ఇందులో ఏమాత్రం సందేహం లేదు. అల్లాహ్ భీతి కలవారికి ఈ గ్రంథం మార్గదర్శకం - వారు అగోచర విషయాలను విశ్వసిస్తారు. నమాజును స్థాపిస్తారు. మేము ప్రసాదించిన దాని నుండి (మా మార్గంలో) ఖర్చు చేస్తారు. (అల్ బఖర : 2,3)*

ఆ తరువాత ఇలా సెలవియ్యడం జరిగింది:

*ఇలాంటి వారు తమ ప్రభువు తరపు నుండి రుజుమార్గంలో ఉన్నారు. సాఫల్యం పొందేవారు వీరే. (అల్ బఖర : 5)*

అంటే ఎవరైతే విశ్వసించరో, నమాజు చెయ్యరో, జకాత్ చెల్లించరో వారు సన్మార్గంలో లేరు, వారికి మేలు ఎన్నటికీ జరగదు అని భావం.

దాని తరువాత 'బకరా' అధ్యాయాన్ని చదువుతూ పొండి. కొన్ని పేజీల తరువాత మీకు ఈ ఆదేశం కనబడుతుంది.

నమాజును స్థాపించండి. జకాత్ ఇవ్వండి. నా సాన్నిధ్యంలో వినమ్రులై తలవంచే వారితోపాటు మీరూ వినమ్రులై తలవంచండి.

(అల్ బఖర : 43)

ఇంకొంచెం ముందుకు వెడితే ఈ అధ్యాయంలోనే ఇలా సెలవియ్యడం జరిగింది.

"సత్కార్యం అంటే మీరు మీ ముఖాలను తూర్పుకో పడమరకో త్రిప్పడం కాదు. సత్కార్యం అంటే మనిషి అల్లాహ్‌నూ, అంతిమ దినాన్నీ, దూతల్నీ, అల్లాహ్ అవతరింపజేసిన గ్రంథాన్నీ, ఆయన ప్రవక్తల్నీ హృదయ పూర్వకంగా విశ్వసించడం. ఇంకా అల్లాహ్ పట్ల ప్రేమతో తాము ఎక్కువగా ఇష్టపడే ధనాన్ని బంధువుల కొరకూ, అనాధల కొరకూ, నిరుపేదల కొరకూ, బాటసారుల కొరకు, సహాయం చెయ్యమని అర్థించే వారికొరకు, ఖైదీలను విడుదల చెయ్యడానికి వ్యయపరచడం. ఇంకా నమాజును స్థాపించడం, జకాత్ ఇవ్వడం, వాగ్దానం చేస్తే దాన్ని పాలించేవారు, కష్టకాలంలో, లేమిలో సత్యానికీ అసత్యానికీ మధ్య జరిగే పోరాటంలో స్థైర్యం చూపేవారు సత్పురుషులు. వాస్తవంగా సత్యసంధులు, అల్లాహ్ ఎడల భయభక్తులు గలవారు వీరే." (బకర - 177)

ఇంకొంచెం ముందుకెడితే 'మాయిదా' సూరాలో ఇలా ఉంది.

వాస్తవానికి మీ మిత్రులు కేవలం అల్లాహ్, అల్లాహ్ ప్రవక్త, నమాజును స్థాపించే, జకాత్ ఇచ్చే, అల్లాహ్ ముందు రుకూ చేసే విశ్వాసులు మాత్రమే. అల్లాహ్‌నూ, ఆయన ప్రవక్తనూ, విశ్వాసులనూ తమ మిత్రులుగా స్వీకరించేవారు, అల్లాహ్ పక్షమే ఆధిక్యం వహిస్తుందని తెలుసుకోవాలి.

(అల్ మాయిద : 55, 56)

ఈ మహోన్నత ఆయత్‌లో ఓ గొప్ప నియమాన్ని చెప్పడం జరిగింది. ఈ ఆయత్‌ను జాగ్రత్తగా చదివితే మొదట మీకు తెలిసేది, విశ్వాసులంటే కేవలం నమాజు చేసేవారు, జకాత్ చెల్లించే వారే అన్నది. ఈ రెండు అంశాలను వదిలేసే

వారి విశ్వాసమే అబద్ధమన్నదీను. ఆ తరువాత రెండో విషయం, దైవం దైవ ప్రవక్త మరియు విశ్వాసులంతా ఒకే పార్టీకి చెందినవారని, విశ్వాసి సర్వం త్యజించి కేవలం ఈ ఒక్క పార్టీలోనే చేరిపోవాలని కూడా తెలిసింది. ఇంకా ఈ పార్టీకి బయట ఉండేవారు - తండ్రైనా, సోదరుడైనా, కుమారుడైనా, పొరుగువాడైనా, స్వదేశీయుడైనా ఎవరైనా సరే వారిని తన మిత్రునిగా చేసుకొని అతనితో ప్రేమ వాత్సల్య సంబంధాలు పెట్టుకుంటే ఆ ముస్లిమ్‌కు అల్లాహ్ తన సహాయ సహకారాలు అందిస్తాడని ఆశించలేడని కూడా తెలిసింది.

ఈ ఆయత్ ద్వారా తెలిసే మూడో విషయం, విశ్వాసులు కేవలం అల్లాహ్‌ను ఆయన ప్రవక్తను, విశ్వాసులను తమ సహాయకులుగా, మిత్రులుగా చేసుకున్నప్పుడే వారికి ఆధిక్యత లభిస్తుంది అనేది.

ఇంకా ముందుకు వెడితే 'తౌబా' అధ్యాయంలో, అల్లాహ్ దైవ తిరస్కారులతో, బహు దైవారాధకులతో పోరాడాలని ఆజ్ఞాపిస్తున్నాడు. వరుసగా కొన్ని ఆయత్‌ల వరకు యుద్ధానికి సంబంధించిన ఆదేశాలే ఉన్నాయి. ఈ విషయమై ఇలా సెలవియ్యడం జరిగింది.

> *"ఒకవేళ వారు పశ్చాత్తాపపడితే, నమాజును స్థాపిస్తే, ఇంకా జకాత్‌నిస్తే వారు మీ ధార్మిక సోదరులే. (తౌబా - 11)*

అంటే కేవలం దైవ తిరస్కార భావం నుండి బహు దైవారాధన నుండి మరలడం విశ్వాసాన్ని ప్రకటించడం మాత్రమే సరిపోదు. వారు నిజంగా దైవ తిరస్కారం, బహుదైవారాధన పట్ల 'తౌబా' చేశారా? యదార్థంగా విశ్వసించారా? అన్నదానికి రుజువు లభించేది వారు నమాజు చేయడం, జకాతు చెల్లించడం ద్వారానే, కాబట్టి వారు తమ ఆచరణ ద్వారా వారి విశ్వాసాన్ని రుజువు చేసు కుంటేనే వారు మీ ధార్మిక సోదరులు అవుతారు. లేకపోతే, వారిని మీరు ధార్మిక సోదరులుగా ఎంచకండి. వారితో యుద్ధం చేయడం ఆపకండి అని అర్థం. ముందుకెడితే ఈ సూరాలోనే ఇలా ఉంది.

"విశ్వాసులైన పురుషులూ, విశ్వాసులైన స్త్రీలూ వారందరూ ఒకరికొకరు

సహచరులు, వారు మేలు చెయ్యండి అని ఆజ్ఞాపిస్తారు. చెడు చెయ్యవద్దు అని నిరోధిస్తారు. నమాజును స్థాపిస్తారు, జకాత్‌ను ఇస్తారు. అల్లాహ్ పట్ల ఆయన ప్రవక్త పట్ల విధేయత పాటిస్తారు. వారి మీదనే అల్లాహ్ తన కారుణ్యాన్ని తప్పకుండా అవతరింపజేస్తాడు. *(తౌబా - 71)*

విన్నారుగా! ఒకవ్యక్తి విశ్వాసాన్ని ప్రకటించి ఆచరణ పరంగా నమాజు మరియు జకాతుకు కట్టుబడి ఉండనంతవరకు ముస్లిములకు ధార్మిక సోదరుడు కాజాలడు. విశ్వాసం, నమాజు, జకాత్ ఈ మూడు కలిసే విశ్వాసుల పార్టీని స్థాపిస్తాయి. ఎవరైతే ఈ మూటికి కట్టుబడి ఉంటారో వారంతా ఈ పవిత్రమైన 'జమాఅత్' పార్టీవారు. వారిలోనే స్నేహం, ప్రేమ, బంధుత్వం, సహాయ సహకారాల సంబంధం ఉండాలి. వీటికి కట్టుబడి ఉండనివారు వారి పేర్లు ముస్లిముల పేర్లే అయినా ఈ పార్టీకి వెలుపలే ఉంటారు. వారితో స్నేహసంబంధాలు పెట్టుకోవడమంటే మీరు అల్లాహ్ చట్టాన్ని ధిక్కరించి అల్లాహ్ పార్టీని చిందర వందర చేశారన్నమాటే. ఇకమీరు ప్రపంచంలో ఆధిక్యతను పొందగలమని ఎలా ఆశిస్తారు?

అలాగే ముందుకు వెడితే హజ్ సూరాలో ఇలా ఉంది.

*"అల్లాహ్ తనకు సహాయం చేసే వారికే తప్పకుండా సహాయపడతాడు. అల్లాహ్ మహాశక్తిమంతుడు, మహాబలవంతుడూను. మేము గనక వారికి భూమిపై అధికారాన్ని ప్రసాదిస్తే, వారు నమాజ్‌ను స్థాపిస్తారు, జకాత్ ఇస్తారు, మంచి చేయమని ఆజ్ఞాపిస్తారు, చెడు నుండి నిరోధిస్తారు. సకల వ్యవహారాల అంతిమ నిర్ణయం అల్లాహ్ చేతులలో ఉంది.*

*(అల్ హజ్ - 40,41)*

ఈ ఆయత్‌లోను బనీ ఇస్రాయీలుకు ఆనాడు చేసిన హెచ్చరికనే ముస్లిములకు చేయడం జరిగింది. బనీ ఇస్రాయీలుకు ఆనాడు, అల్లాహ్ ఈ విధంగా హెచ్చరించాడని నేను ఇంతకుముందే విన్పించాను: "మీరు నమాజ్ చేస్తూ, జకాత్‌నిస్తూ నా ప్రవక్తల కార్యంలో వారికి చేదోడువాదోడుగా ఉంటూ

అంటే మీరు నా చట్టాన్ని భువిలో అమలు చేయడానికి ప్రయత్నం చేస్తూ ఉన్నంత కాలం నేను మీకు తోడుగా ఉంటాను. మీరు దీన్ని వదలేయగానే నా సహాయం కూడా మీకు ఉండదు." అల్లాహ్ ముస్లిముల గురించి కూడా సరిగ్గా ఇదేమాట సెలవిచ్చాడు. వీరితో అన్నది ఏమిటంటే, ఒకవేళ మీరు భువిలో శక్తిని సంపాదించి నమాజును స్థాపిస్తే, జకాత్‌నిస్తే, మంచిని వ్యాపింపజేసి చెడుగులను రూపుమాపితే నేను మీకు సహాయకునిగా ఉండగలను. ఎవరికైతే నేను సహాయ కునిగా వుంటానో వారిని ఎవరూ అణగద్రొక్కలేరు. అలాకాక, మీరేగనక జకాత్ వ్యవస్థను త్యజించి, ప్రపంచంలో అధికారం సంపాదించి మంచికి బదులు చెడును వ్యాపింపజేస్తే, చెడుకు బదులు మంచిని రూపుమాపితే, నా మాటకు బదులు మీ మాటనే నెగ్గించుకునే ప్రయత్నం చేస్తే, పన్నులు వసూలు చేసి మీ కోసం భూమ్మీద స్వర్గం నిర్మించడమే మీ లక్ష్యంగా భావిస్తే, జాగ్రత్త! నా సహాయం మీకు లభించదు, షైతానే మీకు సహాయకుడౌతాడు.

అల్లాహు అక్బర్! ఎంత బాధాకరమైన పరిస్థితి ఇది? బనీ ఇస్రాయీలుకు చేసిన హెచ్చరికను అది ఉత్తుత్తి హెచ్చరిక అనుకున్నారు వారు. తద్ వ్యతిరేకంగా నడిచి దాని పర్యవసానం ఏమిటో నేడు కళ్ళారా చూస్తున్నారు. భూమ్మీద దేశ దిమ్మరుల్లా తిరుగుతున్నారు. ప్రతిదేశం నుండి గెంటివేయబడుతున్నారు. ఎక్కడా వారికి ఠికాణా లభించడంలేదు. కోటాను కోట్ల రూపాయలు వారి బ్యాంకుల్లో మూల్గుతున్నాయి. ప్రపంచంలోకెల్ల సంపన్నమైన జాతి అది. కాని ఈ డబ్బు వారికి ఏమాత్రం లభించడంలేదు. నమాజుకు బదులు వ్యభిచారం, జకాత్‌కు బదులు వడ్డీ వ్యాపారాన్ని అవలంబించి వారు స్వయంగా దైవ శాపాన్ని కొనితెచ్చుకున్నారు. ఇప్పుడు వీరు ఈ అభిశాపాన్ని మోసుకుంటూ ప్లేగు ఎలుకల్లా ప్రపంచ నలుదిశల్లో దాన్ని వ్యాపింపజేసుకుంటూ తిరుగుతున్నారు. ఇప్పుడు ఇదే హెచ్చరిక ముస్లిములకూ చేయడం జరిగినా వారు దాన్ని ఖాతరు చేయకుండా నమాజును, జకాత్‌ను వదిలేశారు.

దైవదత్తమైన తమ శక్తి సామర్థ్యాల్ని, మంచిని వ్యాపింపజేయడంలో, చెడును త్రుంచడంలో వినియోగించడం మానివేశారు. దానికి ఫలితం ఎలా

బయల్పడిందో నేడు మనం తిలకిస్తున్నాం. నేడు వీరు అధికార పీఠం నుండి గెంటివేయబడ్డారు. ప్రపంచంలో దౌర్జన్యపరుల దౌర్జన్యానికి బలౌతున్నారు. ప్రపంచదేశాలన్నిటిలోను బలహీనపడి పరాధీనులయ్యారు. నమాజ్‌ను, జకాత్‌ను వదిలేయడం వల్ల కలిగిన పర్యవసానం ఏమిటో మీరు తిలకిస్తూనే ఉన్నారు గదా! అయితే వారిలోనే మరోవర్గం పుట్టింది. ముస్లిములను అశ్లీలం, వ్యభిచారం రొచ్చులోనికి ఈడ్చుదలుచుకుంటోంది. మీ దారిద్ర్యాన్ని పారద్రోలడానికి బ్యాంకుల్ని, ఇన్స్యూరెన్సు కంపెనీలను తెరచి వడ్డీవ్యాపారాన్ని ప్రోత్సహిస్తోంది. దైవసాక్షి! వాళ్ళే గనక ఇలా వ్యవహరిస్తే, యూదులు ఎలా దైవ శాపానికి గురయ్యారో అలాగునే వీరున్నూ దైవశాపానికి గురైపోవడం ఖాయం.

ముస్లిమ్ సోదరులారా! రాబోయే ప్రసంగాల్లో జకాత్ అంటే ఏమిటి? అల్లాహ్ ఇందులో ఎంత గొప్ప శక్తిని సమకూర్చిపెట్టాడు. ముస్లిములు ఓ మామూలు విషయం అనుకుంటున్న ఈ దైవకారుణ్యంలో వాస్తవానికి ఎన్నో శుభాలున్నాయి. నేటి ఈ ప్రసంగంలో, ఇస్లామ్ ధర్మంలో నమాజు, జకాత్‌ల స్థానం ఏమిటో చెప్పడమే నా ఉద్దేశ్యం. ముస్లిములకు నమాజు చేయకుండానే, జకాత్ చెల్లించకుండానే మీరు ముస్లిములుగా ఉండొచ్చు అంటూ చాలా మంది మౌల్వీలు వారికి నచ్చజెప్పజూస్తున్నారు. కాని దివ్య ఖుర్‌ఆన్ దీన్ని ప్రస్ఫుటంగా ఖండిస్తోంది. ఖుర్‌ఆన్ ప్రకారం, కలిమా (సద్వచనం) ప్రకటనకు ఓ రుజువు అయిన నమాజ్ జకాత్‌లకు కట్టుబడి ఉండకపోతే మీ కలిమా ప్రకటనకే అర్థం లేదు. ఇందుకనే హజ్రత్ అబూబక్ర్ (ర.అన్) జకాత్‌ను ఇవ్వ నిరాకరించినవారిని దైవ తిరస్కారులుగా ఎంచి వారితో పోరాడారు.

దైవాన్ని, దైవప్రవక్తను విశ్వసించి, నమాజు కూడా చేసేవారితో యుద్ధం చేయవచ్చా? అనే అనుమానం కలిగింది మొదట దైవప్రవక్త (సఅసం)గారి సహచర వర్గానికి. కాని దైవ ప్రవక్తకు అతిచేరువగా ఉన్న హజ్రత్ అబూబక్ర్ (ర.అన్) తన పట్టును మాత్రం విడవకుండా "దైవసాక్షి! వీళ్ళు దైవప్రవక్త (సఅసం) కాలంలో ఏ జకాత్ అయితే ఇస్తూ ఉండేవారో ఆ జకాత్‌లో ఒంటెను కట్టే ఓ త్రాడు కూడా ఇవ్వకుండా ఆపినా వారితో యుద్ధం కొనసాగిస్తాను" అని నిక్కచ్చిగా

చెప్పేశారు. అప్పుడు సహాబా మనస్సుల్లో ఆ సత్యాన్ని అల్లాహ్ విశదపరిచాడు. వారంతా జకాత్ చెల్లించని వారితో పోరాడటాన్నే ఒప్పుకున్నారు. దివ్య ఖుర్ఆన్, జకాత్ చెల్లించనివారిని బహుదైవారాధకులుగా, పరలోకాన్ని తిరస్కరించేవారుగా ప్రకటిస్తుంది.

> *జకాత్ ఇవ్వనివారునూ, పరలోకాన్ని తిరస్కరించేవారునూ అయిన బహుదైవారాధకులు వినాశం పాలవుతారు. (హామీమ్ అస్ సజ్దహ్: 6,7)*

# జకాత్ వాస్తవికత

ముస్లిమ్ సోదరులారా! గత ప్రసంగంలో నేను చెప్పిందేమిటంటే నమాజ్ తరువాత జకాత్ ఇస్లామ్‌కు సంబంధించిన ఓ గొప్ప అంశమని నమాజును తిరస్కరించినవాడు ఎలా తిరస్కారి అవుతాడో జకాత్‌ను తిరస్కరించినవాడు కూడా తిరస్కారిగానే పరిగణించబడతాడు. అంతే కాకుండా దైవప్రవక్త (సఅసం) సహచర గణం (సహాబా) జకాత్ తిరస్కారులతో యుద్ధం కూడా చేశారు.

ఇప్పుడు ఈ ప్రసంగంలో నేను, ఇస్లామ్‌లో జకాత్‌కు ఇంత ప్రాముఖ్యత ఎందుకు వచ్చిందో, దీని వాస్తవికత ఏమిటో మీకు వివరిస్తాను.

మీలో కొందరు దారినపోయే దానయ్యలను కూడా తమ మిత్రులుగా చేసుకునేటంతటి అమాయకులు వున్నారు. ఇలా మిత్రులుగా చేసుకునేటప్పుడు అతడు మిత్రుడవడానికి అర్హుడా కాదా అని కూడా పరికించరు. ఇలాంటివారు తరచు మోసానికి గురౌతుంటారు. ఆ తరువాత వారు చిక్కుకునే బాధలకు అంతే ఉండదు. అయితే బుద్ధిమంతులు ఎవరితోనైనా స్నేహం చేస్తే వారిని అన్ని విధాల పరీక్షించి చూస్తారు. సత్యవంతుడు, చిత్తశుద్ధి గలవాడు విశ్వాసపాత్రుడు అయిన స్నేహితుడు లభిస్తే అతణ్ణే స్నేహితునిగా ఎంచుకుని పనికిమాలిన వారందరిని వదిలేస్తారు.

అల్లాహ్ మహోన్నతమైన వివేచనా జ్ఞానం గలవాడు. ఆయన ఎవరినైనా పరిశీలించకుండా తన మిత్రునిగా చేసుకుంటాడని, తన పక్షాన చేర్చుకుంటాడని,

తన దర్బారులో గౌరవప్రదమైన స్థానాన్ని బహూకరిస్తాడని ఎలా తలపోస్తాం? మానవమాత్రులే తమ బుద్ధి వివేకాల్తో ఎలాంటి పరీక్ష లేకుండా ఓ మిత్రుణ్ణి ఎన్నుకోనప్పుడు సకల వివేకాలకు, బుద్ధి జ్ఞానాలకు ఆలవాలమైన ఆ అల్లాహ్ మాత్రం ఎలాంటి పరీక్ష పెట్టకుండా ప్రతి ఒక్కణ్ణి తన మిత్రునిగా చేసుకోవడం అసంభవం. ఈ భూమ్మీద కోట్లాదిమంది మనుషులు వ్యాపించి ఉన్నారు. మంచివారు చెడ్డవారు అంతా అల్లాహ్ పక్షంలో, అంటే భువిపై దైవ ప్రాతినిధ్య స్థానాన్ని అలంకరించి పరలోకంలో దైవ సాన్నిధ్యాన్ని పొందే ఆ 'హిస్బుల్లాహ్' (అల్లాహ్ పార్టీ)లో చేర్చుకోబడ్డానికి అర్హులు కాజాలరు. అల్లాహ్ ఎంతో వివేకంగా వాళ్ళను పరీక్షించడానికి కొన్ని పరీక్షలు, కొన్ని ప్రమాణాలు నియమించాడు. ఎవరైతే వాటిలో పూర్తిగా నెగ్గుతారో వారు అల్లాహ్ పక్షంలోనికి వస్తారు. మరెవరైతే ఆ పరీక్షలో నెగ్గరో, వారు తమంతట తామే ఆ పార్టీ నుండి వేరైపోయి తాము ఈ పార్టీలో ఉండదగ్గవారం కాము అని తెలుసుకుంటారు.

ఆ ప్రమాణాలు ఏవి? అల్లాహ్ ఎంతో వివేకంగలవాడు కాబట్టి ప్రప్రథమంగా ఆయనపెట్టే పరీక్ష వివేకానికి సంబంధించిందే. ఆయన ఆ వ్యక్తిలో తెలివితేటలున్నాయా? బుద్ధిహీనుడు కాదుకదా అని చూస్తాడు. ఎందుకంటే, అవివేకి, అజ్ఞాని, బుద్ధిమాంద్యంగలవాడు ఎప్పుడూ వివేకవంతునికి, జ్ఞానంకలవానికి మిత్రుడు కాజాలడు. అల్లాహ్ సూచనల్ని చూసి ఆయనే నాకు ప్రభువు, ఆయనే నా సృష్టికర్త, ఆయన తప్ప మరెవ్వరూ పూజ్యులుగారు, ఆయనే నావేడుకోలును విని నాకు సహాయం చేస్తాడు అని తలపోసే వ్యక్తి, దైవ వాణిని విన్నంతనే ఇది నా ప్రభువువాణియే, మరెవ్వరి వాణి కాజాలదు అని గ్రహించే వ్యక్తి, నిజమైన ప్రవక్తలు, బూటకపు ప్రవక్తల జీవితం, వారి నైతికత, వారి వ్యవహారాలు, వారి బోధనలు, వారు నిర్వహించే కార్యకలాపాల్లోని తేడాను ఖచ్చితంగా తెలుసుకోగలిగే వ్యక్తి, ఇంకా తాను ప్రవక్తనని వాదన చేసే వారిలో ఫలానా వారు యదార్థంగా దైవం తరపున సన్మార్గాన్ని బోధించడానికి వచ్చిన దైవ ప్రవక్త అని, ఫలానావాడు ఉత్తమోసగాడు, దజ్జాల్ అని గ్రహించగలిగే వ్యక్తి దైవం పెట్టిన ఈ పరీక్షలో నెగ్గగలుగుతాడు. అతణ్ణి మనుషుల గుంపు నుండి వేరు చేసి

అల్లాహ్, తన పార్టీ కోసం ఎంపిక చేసుకుంటాడు. పరీక్షలో తప్పిపోయిన వారు ఎట్టైనా మార్గవిహీనులై పోయేందుకు వదిలేయడం జరుగుతుంది. మొదటి పరీక్షలోనే తప్పిన మిగతా వారిని, వారి ఇష్టప్రకారం నడుచుకునేందుకు వదిలేస్తాడు.

ఈ మొదటి పరీక్షలో ఎవరైతే నెగ్గుతారో వారు మరో పరీక్షకు సిద్ధంగా ఉండాల్సి ఉంది. ఈ రెండో పరీక్షలో మనిషి వివేకానికి తోడు అతని నైతిక శక్తి కూడా పరీక్షింపబడుతుంది. అతనిలో, సత్యాన్ని సదాచారాన్ని గ్రహించి వాటిపై నడిచే శక్తి ఉందా? అసత్యాన్ని దౌష్ట్యాన్ని తెలుసుకొని దానిని వదిలేసే ధైర్యం ఉందా? ఇతడు తన మనోవాంఛలు, తాతముత్తాతల అనుసరణ, కుటుంబ ఆచారవ్యవహారాలు, ప్రపంచంలో చెలామణిలో వున్న భావాలు, పద్ధతులకు దాసుడుకాడు కదా? అతడు ఓ విషయాన్ని దైవ మార్గదర్శకానికి విరుద్ధమైందిగా తలచి, అది చెడ్డదే అని గ్రహించినా దాని వెంటపడేవాడు కాడుకదా? ఇంకా మరో విషయం దైవం దృష్టిలో సక్రమమైనది, సత్యమైనదిగా గ్రహించినా దాన్ని స్వీకరించనివాడు కాడుకదా? అనే పరీక్షలకు గురి చేయడం జరుగుతుంది. ఈ పరీక్షల్లో నెగ్గకుండా ఉన్నవాళ్ళను కూడా అల్లాహ్ తన పార్టీలోనికి తీసుకోడానికి తిరస్కరిస్తాడు.

> *ధర్మం విషయంలో నిర్బంధంకానీ, బలాత్కారంకానీ లేవు. సత్యవాక్కు అసత్యవాక్కులనుండి ప్రస్ఫుటం చెయ్యబడింది. ఇకనుండి 'తాగూత్‌ను తిరస్కరించి, అల్లాహ్‌ను విశ్వసించినవాడు సుస్థిరమైన, ఎన్నటికీ విడిపోని ఆశ్రయం పొందినట్లే. (అల్ బఖర : 256)*

అని నిర్వచించబడింది వారికి.

ఈ పరీక్షలోను నెగ్గినవారు తిరిగి మూడో స్థాయి పరీక్షకు హాజరు కావలసి ఉంటుంది. ఇది ఆజ్ఞాపాలనకు సంబంధించిన పరీక్ష. ఇక్కడ, మా తరపున డ్యూటీ కోసం పిలుపురాగానే మీ నిద్రను త్యజించి వచ్చి హాజరుకండి, మీ పనిబాటల్ని ఆపేసి రండి. మీ ప్రయోజనాల్ని మీ సరదాల్ని వదిలేసి మీ విధిని నిర్వహించండి. ఎండా కాలం లేక చలికాలం అయినా అన్ని వేళలా మీకు మీ

విధి నిర్వహణ గురించి పిలిస్తే ఎన్ని కష్టాలు కలిగినా సరే అన్నిటిని ఓర్చి పరుగెత్తుకుంటూ రండి అని ఆదేశించడం జరిగింది. ఇదే కాకుండా ఓ పరిమిత కాలంలో తెల్లవారు ఝామునుండి సూర్యాస్తమయం వరకు పస్తులుండండి, మీ మనోవాంఛలకు దూరంగా ఉండండి అని ఆదేశిస్తే ఆ ఆదేశాన్ని పూర్తిగా పాలించాలి. మీకు ఆకలి దప్పుల బాధ ఎలాగున్నా, ఎంత కష్టం కలిగినా, ఘుమఘుమలాడే రకరకాల వంటకాలు, చల్లని పానీయాలు ఎన్ని మీముందున్నా సరే. ఎవరైతే ఈ పరీక్షలో నెగ్గకుండా ఉంటారో వారిని కూడా మీరు పనికిరానివారు అని చెప్పి తొలగించడం జరుగుతుంది. ఈ మూడో పరీక్షలో గట్టిగా నిలబడగలిగిన వారిని మాత్రమే ఎంచుకోవడం జరుగుతుంది. ఎందుకంటే దైవం తరపున ఏ చట్టాలైతే చేయబడతాయో, ఏ సూచనలైతే ఇవ్వడం జరుగుతుందో వారు ప్రత్యక్షంగాను పరోక్షంగాను, లాభకరమైనా, నష్టదాయకమైనా అన్ని వేళలా ఆ చట్టాలకు, సూచనలకు బద్ధులై ఉండగలరు.

దీని తరువాత నాల్గవ పరీక్ష ధన త్యాగానికి సంబంధించింది. మూడో పరీక్షలో నెగ్గిన అభ్యర్థులు సైతం, దేవుని ఉద్యోగంలో తప్పనిసరిగా చేరేందుకు అర్హులుకారు. వారి ధైర్యం సడల్లేదుగదా? వారు సంకుచిత మనస్తత్వం గలవారుకారుకదా అన్న విషయాల్ని చూడాల్సి ఉంది. వీరు తమ స్నేహంలో ప్రేమను ఎంత ఒలకబోసినా, తమ మిత్రుని కోసం జేబునుండి ఏదైనా ఖర్చు పెట్టవలసివస్తే ఒక చిల్లిగవ్వైనా ఖర్చు పెట్టడానికి కూడా ముందుకురాని వాళ్ళు కారుకదా? ఎలాగైతే కొంతమంది నోటితో మాతా మాతా అంటూనే ఆ మాతకోసం ఎన్నో ఘర్షణలకు దిగుతారు. తీరా ఆ మాతయే ధాన్యం గంపలోను, కూరగాయల బుట్టలోను ముట్టెవేస్తే కర్ర పుచ్చుకొని కోపంగా దానివెంటబడి బాదేస్తారు తోలు చిట్లినట్లు. ఇలాంటి పరిస్థితి కాదుకదా ఇతనిది? ఇలాంటి స్వార్థపరుణ్ణి, డబ్బంటే పడిచచ్చేవాణ్ణి, ఇలాంటి సంకుచిత మనస్తత్వం గలవాణ్ణి ఓ మామూలు మనిషి కూడా మిత్రునిగా స్వీకరించడే. ఓ విశాల హృదయం గల మనిషి ఇలాంటివాణ్ణి దరికే చేరనివ్వడే! మరి మహోన్నతుడైన ఆ దైవం, తన ఖజానా ద్వారాలను ఎల్లవేళలా తన అనంత కోటి సృష్టితాల కోసం తెరచిన ఆ దాత, దైవం

ప్రసాదించిన ధనం నుండే దైవ మార్గంలో ఖర్చుపెట్టడానికే వెనకాడే వ్యక్తిని తన మిత్రునిగా ఎలా ఎన్నుకుంటాడు? ఈ నాల్గో పరీక్షలో నెగ్గని వారితో, అల్లాహ్‌పక్షంలో మీకు ఎలాంటి స్థానం లేదు, మీరు పనికిమాలిన వారే, దైవ ప్రతినిధికి అప్పజెప్పబడే బాధ్యతా భారాల్ని మీరు మోయలేరు అని నిక్కచ్చిగా చెప్పడం జరుగుతుంది. ఈ పార్టీలో కేవలం దైవ ప్రేమకోసం, తమ ప్రాణాలపై ఉన్న మమకారాన్ని, ధన వ్యామోహాన్ని, సంతాన వాత్సల్యాన్ని, కుటుంబం ఎడలగల ప్రేమానురాగాల్ని మాతృభూమితో గల అనుబంధాన్ని ఒక్కటేమిటి సమస్తమూ త్యజించాల్సి ఉంటుంది.

> *మీరు అమితంగా ప్రేమించే వస్తువులను (అల్లాహ్ మార్గంలో) ఖర్చుపెట్టనంత వరకు మీరు సత్కార్యస్థాయికి చేరుకోలేరు.*
>
> *(అలి ఇమ్రాన్ : 92)*

ఈ పార్టీలో సంకుచిత భావాలుగలవారికి, పిసినారులకు చోటేలేదు. ఈ పక్షంలో స్థానం సంపాదించేది కేవలం దాతృత్వం గల విశాల హృదయులే.

> *"వాస్తవానికి హృదయలోభత్వం నుండి రక్షింపబడినవారే సాఫల్యం పొందేవారు." (అల్ హష్ర్ : 9)*

ఇక్కడ కావలసిందల్లా విశాల హృదయులు, ఎవరైనా వారితో శతృత్వం వహించినా వారికి నష్టం వాటిల్లజేసినా, కఠోరపదజాలంతో వారి హృదయాలను గాయపరిచినా, అలా ప్రవర్తించేవారిని దైవం కోసం తినడానికి తిండి కట్టుకోవడానికి బట్ట సమకూర్చడంలో వెనుకాడనివారు. కష్టాల్లో వారికి సహకారమందించడంలో వెరువనివారు.

> *మీలోని ప్రముఖులు, స్థితిపరులు తమ బంధువులకూ, నిరుపేదలకూ, అల్లాహ్ మార్గంలో వలసవచ్చిన ప్రజలకూ, సహాయం చేయకూడదని ప్రమాణంచేయరాదు. వారిని క్షమించాలి, వారి (తప్పులను)ని ఉపేక్షించాలి. మిమ్మల్ని అల్లాహ్ క్షమించాలని మీరు కోరుకోరా? అల్లాహ్ గుణం ఏమిటంటే, ఆయన క్షమించేవాడు, కరుణించేవాడూను. (అన్ నూర్ : 22)*

ఇక్కడ కావలసింది ఉన్నత భావాలు కలవారే.

కేవలం అల్లాహ్ ప్రేమకోసం, నిరుపేదలు, అనాధలు, ఖైదీలకు భోజనం పెట్టేవారు (అలా భోజనం పెడుతూ),

> *'మేము కేవలం అల్లాహ్ కోసమే మీకు అన్నం పెడుతున్నాము. మేము మీనుండి ఎలాంటి ప్రతిఫలాన్నిగానీ, కృతజ్ఞతలుగానీ ఆశించటంలేదు.'*
>
> *(అద్ దహ్ర్ : 8,9)*

అని అనేవారు.

ఇక్కడ కావలసింది, దైవం ఇచ్చిన ధనాన్ని ఆయన మార్గంలోనే ఖర్చుపెట్టేటప్పుడు ఉత్తమమైన దాన్ని ఎంచుకొని ఖర్చుపెట్టేవారు.

> *"విశ్వసించిన ప్రజలారా! మీరు సంపాదించిన ధనంలోని, మేము మీ కొరకు నేలనుండి ఉత్పత్తి చేసినదానిలోని మేలైన భాగాన్ని దైవమార్గంలో ఖర్చుపెట్టండి, ఆయన మార్గంలో ఇవ్వటానికి పనికిరాని వస్తువుల్ని ఏరితీసే ప్రయత్నం చెయ్యకండి." (అల్ బఖర : 267)*

ఇక్కడ కావలసింది తాము పేదరికంలో మ్రగ్గుతూనే, దారిద్ర్యానికి లోనైకూడా, తాము కష్టపడుతూ దైవ ధర్మమార్గంలోను, దైవదాసుల శ్రేయంకోరి వారికి సహాయం చేయడంలో వెనుకంజ వేయనివారు.

> *"మీ ప్రభువు క్షమాభిక్ష వైపునకు, స్వర్గం వైపునకు పోయేమార్గంలో పరుగెత్తండి. ఆ స్వర్గం భూమ్యాకాశాలంత విశాలమైంది, అది భయ భక్తులు గలవారికొరకు తయారుచేయబడింది. వారు కలిమిలో, లేమిలో, ఏ స్థితిలోవున్నా తమ సంపదను ఖర్చుచేసేవారు."*
>
> *(ఆలి ఇమ్రాన్ : 133, 134)*

ఇక్కడ కావలసినవారల్లా, చిత్తశుద్ధితో, దైవమార్గంలో ఖర్చు అయినది వృధాపోదని, దైవం దానికి ప్రతిఫలం ఈ లోకంలోను పరలోకంలోను ఒసగగలడని నమ్మేవారే. అందుకే వారు దైవాన్ని సంతోషపర్చడానికే ఖర్చుబెడతారు. వారి

దాతృత్వం ఇతరులకు తెలిసినా, తెలియకపోయినా సరే వారి దానానికి కృతజ్ఞతలు లభించాయా లేదా? అన్నది చూడరు. ఇలాంటి విశ్వాసులే అల్లాహ్‌కు కావలసింది.

> *"మంచిమార్గంలో మీరు ఖర్చు చేసేధనం మీకే మేలు చేకూరుస్తుంది. అసలు మీరు ఖర్చు చేసేది అల్లాహ్ సంతోషం పొందటానికేగా! కనుక మంచి మార్గంలో మీరు ఏమి ఖర్చు చేసినా, దాని ప్రతిఫలం మీకు పూర్తిగా లభిస్తుంది. మీకు అన్యాయం ఎంతమాత్రం జరగదు."*
>
> *(అల్ బఖర : 272)*

ఇక్కడ కావలసిందల్లా ధైర్యంకలవారే. సంపన్నులైనా దైవాన్ని మరువరు. మేడల్లో కూర్చుండి సుకుమారంగా జీవితం వెళ్ళబుచ్చుతూ ఉన్నా, వారికి ఎల్లవేళలా దైవం గుర్తుంటాడు.

> *"విశ్వాసులారా! మీ సిరిసంపదలూ, మీ సంతానమూ మిమ్మల్ని అల్లాహ్ సంస్మరణ నుండి మరల్చరాదు. ఎవరైతే ఇలా మరల్చబడతారో వారే నష్టానికి గురి అయ్యేవారు. (అల్ మునాఫికూన్ : 9)*

ఇవీ అల్లాహ్ పార్టీలో చేరేందుకు కావలసిన తప్పనిసరి అర్హతలు. ఇవి లేకుండా ఎవడూ అల్లాహ్ మిత్రుల్లో చేరలేడు, ముఖ్యంగా ఇది కేవలం మనిషి నైతికతలకు సంబంధించిన పరీక్ష కాదు, అతని విశ్వాసానికి సంబంధించిన కఠినపరీక్ష కూడా. ఎవరైతే దైవమార్గంలో ఖర్చుపెట్టడానికి వెనుకాడుతారో, ఈ ఖర్చును తనపైవేసిన 'టాక్సు' లేక 'జరిమానా'గా తలుస్తాడో, సాకులు వెదుకుతూ దాన్ని తప్పించుకునే ప్రయత్నం చేస్తుంటాడో, ఖర్చు పెట్టినా తనకు కలిగిన ఈ నష్టాన్ని ఇతరులపై ఎత్తిపాడుపుల రూపంలో వెళ్ళబుచ్చుతూ ఉంటాడో అతడు దైవంపై, పరలోక జీవితంపై విశ్వాసం లేనివాడు. దైవమార్గంలో తాను ఖర్చు పెట్టిందంతా వృధా అయిపోయింది అని అనుకునే వ్యక్తి అతను. అతనికి తన భోగవిలాసాలు తన హాయి, తన ప్రయోజనాలు తన పలుకుబడి ఒక్కటేమిటి సమస్తమూ దైవ సంతుష్టి కంటే అధికంగా ప్రియమైనది. అతడు అనుకునేదల్లా

ఈ ప్రాపంచిక జీవితమే అసలైన జీవితం. ఒకవేళ డబ్బు ఖర్చే అయినా దానికి ఫలితం ఈ లోకంలోనే ప్రాప్తంకావాలని, పలుకబడి, పేరురావాలని అనుకుంటాడు. లేకపోతే ఆ డబ్బు ఖర్చు అయిపోయినా దానికి తగ్గట్టు తన పలుకుబడి పెరగక ఫలానా దాత ఫలానా సత్కార్యంలో ఇంత మొత్తాన్ని ఖర్చుపెట్టాడు అన్నది ఇతరులకు తెలియకపోతే తాను చేసిన ఆ దానం బూడిదలోపోసిన పన్నీరు చందమైపోతుంది అనుకుంటాడు. దివ్య ఖుర్ఆన్‌లో ఇలాంటి వ్యక్తి దైవానికి పనికిరానివాడని, అతడు విశ్వాస ప్రకటన చేసినా అది కపటమైన ప్రకటనే అని చెప్పడం జరిగింది. ఈ క్రింది ఖుర్ఆన్ వాక్యాలను గమనించండి.

> *"విశ్వసించిన ఓ ప్రజలారా! కేవలం పరులమెప్పును పొందటానికే తన ధనం ఖర్చుచేసేవాని మాదిరిగా అల్లాహ్‌నూ, అంతిమ దినాన్నీ విశ్వసించనివాని మాదిరిగా, మీరు దెప్పిపొడిచి, గ్రహీత మనస్సును గాయపరచి ఈ దానధర్మాలను మట్టిలో కలపకండి." (అల్ బఖర : 265)*
>
> *వెండి బంగారాలను పోగుచేసి వాటిని దైవమార్గంలో ఖర్చుపెట్టని వారికి వ్యధాభరితమైన శిక్ష యొక్క శుభవార్తను అందజెయ్యండి.*
>
> *(అత్ తౌబా : 34)*
>
> *అల్లాహ్‌పై, అంతిమదినంపై విశ్వాసం కలిగి ఉండేవారు, తమ ప్రాణాలనూ, తమ సంపదలనూ ఒడ్డి పోరాడే విషయంలో తమను మన్నించవలసినదని నిన్ను ఎన్నటికీ అభ్యర్థించరు. భయభక్తులు కలవారిని అల్లాహ్ బాగా ఎరుగును. అల్లాహ్‌నూ, అంతిమ దినాన్ని విశ్వసించనివారు తమ మనస్సులో సంశయాలు ఉండి వాటిలోనే ఊగిసలాడేవారు మాత్రమే అటువంటి అభ్యర్థనలను చేస్తారు.*
>
> *(అత్ తౌబా : 44, 45)*
>
> *"వారు ఇచ్చిన సంపద స్వీకరించబడకపోవటానికి దీనికంటే మరొక కారణమేదిలేదు. వారు అల్లాహ్‌నూ, ఆయన ప్రవక్తనూ తిరస్కరించారు.*

నమాజ్‌కు వస్తే బద్ధకంతో వస్తారు. దేవుని మార్గంలో ఖర్చుపెడితే అయిష్టంగానే ఖర్చుపెడతారు. *(అత్ తౌబా : 54)*

“కపటులైన పురుషులూ కపటులైన స్త్రీలూ అందరూ ఒకే కోవకు చెందిన వారు. వారు చెడును చెయ్యండి అని ఆజ్ఞాపిస్తారు. మంచిని చెయ్య వద్దు అని వారిస్తారు. ఇంకా తమ చేతుల్ని మేలు చేయకుండా ఆపుతారు. వారు అల్లాహ్‌ను మరచిపోయారు, కనుక అల్లాహ్ కూడా వారిని మరచి పోయాడు. నిశ్చయంగా ఈ కపటులే ద్రోహులు.”

*(అత్ తౌబా : 67)*

దేవుని మార్గంలో ఖర్చుపెడుతున్నప్పుడు అది బలవంతంగా తమపై రుద్దబడిందని భావించేవారు ఈ ఎడారి అరబ్బులలో కొందరు ఉన్నారు.

*(అత్ తౌబా : 98)*

చూడండి! అల్లాహ్ మార్గంలో ధనం ఖర్చుపెట్టండి అని మీకు పిలుపు ఇవ్వబడుతోంది. దాని విషయంలో మీలో కొందరు పిసినారితనంతో వ్యవహరిస్తారు. కాని పిసినారితనం వహించే వ్యక్తి నిజానికి తనపట్ల తానే పిసినారితనం చూపుతున్నాడు. అల్లాహ్ అయితే ఎంతో సంపన్నుడు, మీరే ఆయనపై ఆధారపడి ఉన్నవారు. ఒకవేళ మీరు విముఖులైతే, అల్లాహ్ మీ స్థానంలో మరోజాతిని దేన్నయినా తీసుకువస్తాడు. వారు మీవంటి వారై ఉండరు. *(ముహమ్మద్ : 38)*

ముస్లిమ్ సోదరులారా! ధర్మంలోని ప్రధానాంశమైన జకాత్ యొక్క వాస్తవికత ఇది. దీన్ని ప్రపంచంలో చెలామణి అయ్యే టాక్స్ (TAX) అనుకోండి. ఇది ఇస్లామ్‌కు ప్రాణం, ఆత్మలాంటిది. వాస్తవంగా ఇది విశ్వాసానికి పరీక్ష కూడా. ఎలాగైతే ఓ విద్యార్థి తరగతులవారీగా పరీక్షలు రాస్తూ తన విద్యాస్థాయిని పెంచుతూ చివరికి పట్టభద్రుడు అవుతాడో అలాగే దైవం వద్ద పరీక్షలున్నాయి. ఆ పరీక్షలను దాటుకుంటూ పోవాల్సి వస్తుంది. ఓ మనిషి ఎప్పుడైతే నాల్గో పరీక్ష అంటే ‘ధన త్యాగం’లో విజయం సాధిస్తాడో అప్పుడే అతడు పూర్తి ముస్లిమ్

అవగలడు. అయితే ఇది చివరి పరీక్ష మాత్రమే కాదు, దాని తరువాత పెట్టబోయే పరీక్ష ప్రాణ త్యాగానికి సంబంధించిన పరీక్ష. ఈ పరీక్ష గురించి ముందు ముందు మీకు వివరించగలను. కాని ఇస్లామ్ పరిధిలో మరో విధంగా చెప్పాలంటే అల్లాహ్ పక్షంలో చేరడానికి ఏ పరీక్షలైతే అవసరం అవుతాయో వాటిలోమాత్రం ఇది చివరిది. 'దైవ మార్గంలో ఖర్చుపెట్టండి, ధనాన్ని నీళ్ళప్రాయంగా వెచ్చించండి' అనే ప్రసంగాలు నేడు ముస్లిములకు అనేకం వినిపించడం జరిగింది. "ఇక ముస్లిముల ఈ దారిద్ర్యాన్ని పారద్రోలడానికి, పేదరికం నుండి వారిని బయటకు లాగడానికి సంబంధించిన ప్రసంగాలు నేడు కావలసింది" అని కొంతమంది అంటూ ఉంటారు. అయితే దేన్ని గురించి వారు కాదంటున్నారో అదే ఇస్లామ్‌కు ప్రాణం అన్న సంగతి వారికి తెలియదులా ఉంది. ముస్లిములు నేడు అధఃపాతాళానికి దిగజారిపోవటానికి గల కారణం ఈ ఆత్మ కరువైపోవడమే. ముస్లిములు పతనమైంది ఈ "ఆత్మ" వల్లకాదు. అసలు చెప్పాలంటే ఈ ఆత్మ వారి నుండి దూరమైన మరుక్షణమే వారు ఇంత నీచస్థితికి దిగజారిపోతారు.

జకాత్, దానధర్మాలు వాస్తవంగా మన సామూహిక జీవితానికి ప్రాణం. వాటిలో మన కోసం పరలోకంలోనే కాదు ఈ ప్రాపంచిక జీవితంలోను ఏనలేని వరాలు పొందుపర్చబడి ఉన్నాయి అన్నది నేను రాబోయే ప్రసంగాల్లో మీకు వివరించగలను.

# సామూహిక జీవితంలో జకాత్ స్థానం

ముస్లిం సోదరులారా! గత రెండు ప్రసంగాల్లో నేను జకాత్ వాస్తవికత గురించి వివరించాను. ఇప్పుడు మీకు దీని మరో కోణాన్ని గురించి చెపుతాను.

దివ్యఖుర్‌ఆన్‌లో జకాత్, సదఖాలకు సంబంధించి అనేక చోట్ల "ఇన్ఫాఖ్ ఫీసబీలిల్లాహ్" అనే పదం ఉపయోగించడం జరిగింది. అంటే దైవ మార్గంలో ఖర్చు పెట్టటం అన్నమాట. కొన్ని చోట్లయితే, "మీరు దైవ మార్గంలో ఏదైతే ఖర్చు చేస్తారో అది ఆయనకిచ్చే ఉత్తమ రుణం" అని కూడా చెప్పడం జరిగింది. అంటే

మీరు అల్లాహ్‌కు ఇచ్చిన అప్పు వల్ల అల్లాహ్ మీకు రుణగ్రస్తుడయ్యాడు. అనేక చోట్ల, మీరు దైవ మార్గంలో ఏదైతే ఖర్చుబెడతారో దాని ప్రతి ఫలాన్ని చెల్లించడం అల్లాహ్ బాధ్యత. ఆయన మీకు అంతవరకే వాపసు చెయ్యడు. అంతకంటే ఎన్నోరెట్లు ఎక్కువ మొత్తాన్నే మీకు ముట్టజెపుతాడు అని ఉంది. ఈ వాక్యాలను గురించి ఆలోచించండి! ఈ భూమ్యాకాశాల స్వామి, దైవం క్షమించుగాక! మీ సమక్షంలో అపేక్షాపరుడా? ఆ పరిశుద్ధుడైన దైవం మీ నుండి అప్పుతీసుకోవలసి వచ్చిందా? ఆ రారాజు, ఎనలేని ఖజానాలకు అధిపతి, తనకోసం మీ ముందు చేయి జాపవలసి వచ్చిందా? దైవం క్షమించుగాక! ఆయన మీకు ఒసగిన దాని పైన్నే గదా మీరు జీవించేది. ఆయన ఇచ్చిన భుక్తినే గదా మీరు తింటున్నది. మీలోని ప్రతి పేదవాని దగ్గర, మీ సంపన్నుని దగ్గర ఉన్నదంతా ఆయన బహూకరించిందే కదా? మీలోని ఓ ఫకీరు మొదలు కోటీశ్వరుడు ఇంకా చెప్పాలంటే సహస్రకోటీశ్వరుడు సైతం ఆయన కారుణ్యాన్ని కాంక్షించేవాడే. ఆయనకు మాత్రం ఎలాంటి అవసరం లేదు. మిమ్మల్ని అప్పు అడిగే అవసరం గాని మీ ముందు చేయిజాచి యాచించే అగత్యం గాని ఏమొచ్చింది ఆయనకు? అసలు విషయం ఏమిటంటే మీ కోసమే, మీ మేలుకోరే మీ పనుల్లోనే ధనాన్ని ఖర్చుబెట్టండి అని చెప్పి ఏదైతే మీరు ఖర్చు పెడుతున్నారో అది నా మార్గంలో పెట్టిన ఖర్చు, అది మీరు నాకిచ్చిన అప్పు, దాన్ని తీర్చడం నా విధి, నేను మీకు రుణపడి ఉంటాను అని చెప్పడం ఆయన కారుణ్యానికి నిదర్శనం.

మీరు మీ సమాజంలోని నిరుపేదలపై, ఆర్తులపై, అగత్యపరులపై దాన్ని ఖర్చుబెట్టండి. ఆ నిరుపేదలు పాపం తిరిగి ఎలా తీర్చగలరు. వారి తరపున నేను తీరుస్తాను. మీరు మీ నిరుపేద బంధువుల్ని ఆదుకోండి. ఆ రుణం వారిపై కాదు నాపై ఉంటుంది. దాన్ని నేను తీరుస్తాను. మీరు మీ అనాధల్ని, వితంతువుల్ని, మీ వికలాంగుల్ని, బాటసారుల్ని, కష్టాల్లో చిక్కుకున్న మీ సోదరుల్ని ఏదైతే ఇచ్చి ఆదుకుంటారో అదంతా నా ఖాతాలో రాసుకోండి. వారిని అడక్కండి. అది నాపై ఉన్న అప్పు. దాన్ని నేను తీరుస్తాను అంటాడు అల్లాహ్. అదే విధంగా మీరు కష్టాల్లో చిక్కుకున్న మీ సోదరులకు అప్పు ఇచ్చి వారి నుండి వడ్డీ అడక్కండి.

వారిని బాధించకండి. వారు అప్పు తీర్చే స్థితిలో లేకపోతే వారిని సివిల్ జైలుకు పంపించకండి. వారి బట్టల్ని వారి పాత్రల్ని వేలం వేయించకండి. వారి ఆలు బిడ్డలను వారి ఇంటి నుండి బయటికి గెంటించకండి. మీరిచ్చిన అప్పు వారిపై కాదు నాపై ఉంది. వాళ్ళే గనక మీ అసలు ధనాన్ని తిరిగి తీర్చేస్తే వడ్డీ నేను తీరుస్తాను. వారు అసలు కూడా తీర్చకపోతే అసలూ, వడ్డీ రెండూ నేను తీరుస్తాను. ఈ లాగునే మీరు మీ సామూహిక సంక్షేమ కార్యాల్లో మీ మానవ జాతి మనుగడకు ఏదైతే ఖర్చుపెడుతున్నారో దాని లాభం మీకే లభిస్తుంది. అయితే మీరు చేసిన ఆ ఉపకార భారం నాపై ఉంది. దాన్ని పైసా లాభంతోసహా నేను చెల్లించగలను.

ఇదండీ! ఆ కరుణామయుడు, చక్రవర్తులకే చక్రవర్తి అయిన అల్లాహ్ ఔన్నత్యం. మీ దగ్గరున్నదంతా ఆయన ఒసగినదే. మీరు ఎక్కణ్ణుండీ తీసుకురారు గదా. ఆయన ఖజానా నుండే తీసుకుంటారు. మీరు ఏదైతే ఇస్తారో ఆయనకు కాదు ఇచ్చేది. మీ బంధువులకు, మీ సోదరులకు, మీ జాతి ప్రజలకే ఇచ్చేది. మీరు మీ సామూహిక సంక్షేమ కార్యకలాపాల్లో ఖర్చు పెట్టినందుకు కలిగే ప్రయోజనం తిరిగి మీకే చేరుతుంది. కాని ఆ దయామయుడు, నిజమైన దాత దయాదాతృత్వాలను చూడండి! మీరు ఆయన ద్వారా పొందిన ధనం నుండి ఏదైతే మీ వారికి ఇస్తున్నారో దాన్ని ఆయన అది నాకిచ్చారు, నా మార్గంలో ఖర్చుపెట్టారు, నాకే అప్పిచ్చారు. దాని ప్రతిఫలం నేను మీకిస్తాను అంటాడు. అల్లాహు అక్బర్! దైవానికే ఈ గొప్పదనం చెల్లు.

నిరపేక్షాపరుడైన ఆ అల్లాహ్ దాతృత్వం, దయాగుణం అలాంటిది మరి. ఏ మానవమాత్రుడూ ఆ ఔన్నత్యాన్ని ఊహించనైనాలేడు.

అల్లాహ్ మనిషిని సద్వర్తనం, దాతృత్వంవైపు పురిగొల్పడానికి ఈ మార్గాన్ని ఎందుకు ఎంచుకున్నాడో ఇప్పుడు ఆలోచించండి. ఈ ప్రశ్న గురించి మీరెంత ఆలోచిస్తే ఇస్లామీయ బోధనల పరిపూర్ణత, పరిశుద్ధత అంతే మీకు అవగతమవుతూ పోతుంది. ఇలాంటి సాటిలేని బోధన దైవం తప్ప మరెవ్వరిదీ కాదు, అని మీ మనసు సాక్ష్యమిస్తుంది.

మనిషి తన నైజం రీత్యా ఓ అజ్ఞాని అన్న విషయం మీకు తెలిసిందే. ఇతని దృష్టి హ్రస్వ దృష్టి, అతడు మరింత దూరం వరకు చూడలేడు. ఇతని మనసు సంకుచితమైంది. మరీ గొప్ప ఆలోచనలు అందులో ఇమడటం అరుదే. ఇతడు స్వార్థపరుడు. తన స్వార్థం గురించిన విశాల భావన కూడా అతని మస్తిష్కంలో జనించదు. ఇతడు తొందరపాటు గలవాడు. ప్రతి విషయానికి సంబంధించిన ఫలితాన్ని, ప్రయోజనాన్ని వెంటనే పొందాలనుకుంటాడు.

ఏ ఫలితమైతే వెంటనే అతని ముందు ప్రత్యక్షమవుతుందో, మరే ప్రయోజనమయితే అతనికి వెంటనే కనబడుతుందో అదే అసలైన ఫలితమని, అదే అసలైన ప్రయోజనమని అనుకుంటాడతడు. ఆలస్యంగా బయల్పడే ఫలితాలపైకి అతని దృష్టి పోజాలదు. అదీగాక పెద్ద మొత్తంలో వచ్చే లాభాల గురించి సుదీర్ఘ కాలం వరకు లాభించే ప్రయోజనాల గురించి అతడు చాలా తక్కువగా అంచనా వేస్తాడు. ఒక్కొక్కప్పుడు ఆ అంచనాలు సాధ్యం కావు అతనికి. ఇది మనిషి సహజమైన బలహీనత. ఈ బలహీనతల ప్రభావం మూలంగా ప్రతి విషయంలోనూ అతడు తన సొంత లాభాన్నే కాంక్షిస్తాడు. అది కూడా పరిమితమైనది, త్వరగా అందేది, అనుభవించదగ్గది. ఇతడు అనేదల్లా, "ఏదైతే నేను సంపాదించానో, లేక నా తాత తండ్రుల నుండి నాకు లభించిందో అదినాదే, ఇందులో మరెవ్వరికీ భాగం లేదు. ఇది నా అవసరాలకై నాకోరికల కోసం, నా సుఖం కోసం, నా మనో వాంఛల పరిపూర్తికై ఖర్చుకావాలి. లేక దీని లాభం నాకు త్వరగా కనబడే ఏ పనిలోనైనా ఖర్చు కావాలి.

"నేను డబ్బు ఖర్చు పెడితే దానికి బదులుగా అంతకన్నా లేక అధికంగా డబ్బైనా దొరకాలి. నా సుఖాన్ని మరింత పెంచాలి. కనీసం నాకు పేరైనా రావాలి. నాకు కీర్తి కండూతి కలగాలి. నా గౌరవం ఇనుమడించాలి. నాకు బిరుదు, అధికారం లభించాలి. ప్రజలు నా ముందు మోకరిల్లాలి. ప్రతివాడు నా గురించే చెప్పుకోవాలి. ఇలాంటి విషయాల్లో నాకు ఏమీ లభించకపోతే నా సొమ్మును నేను ఎందుకు ఖర్చుపెట్టాలి? దరిదాపుల్లో ఏ అనాథ అయినా ఆకలితో అలమటిస్తుంటే,

లేక పనిలేకుండా తిరుగుతుంటే నాకేమిటి? అతణ్ణి నేనెందుకు సంరక్షించాలి. అతని బాధ్యత అతని తండ్రిపై ఉండేది. అతడు తన సంతానం కోసం ఏదైనా వదలి వెళ్ళాల్సింది. లేక ఇన్సూరెన్స్ చేసి మరణించాల్సింది. ఓ వితంతువు నా వాడలో కష్టాల పాలైతే నాకేమిటి? ఆమె గురించి ఆమె భర్త ఏదైనా ఏర్పాటు చేయాల్సింది. ఓ బాటసారి డబ్బు లేక తిరుగుతూ ఉంటే నాకేమిటి? ఆ బుద్ధిహీనుడు తన గురించి ఏమీ పట్టించుకోక అసలు ఇంట్లో నుండి ఎందుకు బయల్దేరాడు? ఒకడు కష్టాల్లో చిక్కుకొని ఉంటే నేనేం చేసేది. అల్లాహ్ అతనికి కూడా నాలాగా కాళ్ళూ చేతులు ఇచ్చాడు కదా! - తన అవసరాలు తాను తీర్చుకోడానికి? అతనికి నేనెందుకు సహాయం చెయ్యాలి. నేనేదైనా ఇస్తే అప్పుగా ఇస్తాను. అసలుతో పాటు వడ్డీ కూడా వసూలు చేస్తాను. నా డబ్బుకు విలువ లేకుండా లేదు కదా! - నే నా డబ్బుతో ఇల్లు కట్టుకోగలను, కారు కొనగలను, లేక మరే లాభదాయకమైన వ్యాపారం చేయగలను. నేనిచ్చే అప్పుతో అతడు ఏదో ఒక విధమైన ప్రయోజనం పొందుతాడు గదా మరి ఆ లాభం నుండి నా వాటా నేనెందుకు వసూలు చేయకూడదు.''

ఇలాంటి స్వార్థపరమైన మనస్తత్వమున్న వ్యక్తి తన ధనాగారంపై పడగ విప్పిన నాగులా కూర్చుంటాడు. ఖర్చు పెట్టినా తన స్వప్రయోజనం కోసమే ఖర్చు పెడతాడు. తనకు ఎలాంటి లాభం లేని విషయంలో ఒక్క పైసా కూడా తన జేబు నుండి తీయడు. ఒకవేళ ఓ పేద వానికి సహాయం జేసినా, అసలది సహాయ రూపేణా కాకుండా ఆ పేదవాణ్ని దోచుకునేందుకు చేస్తాడు. ఇచ్చిన దానికన్నా ఎక్కువే వసూలు చేస్తాడు. ఓ నిరుపేదకు ఏదైనా ఇస్తే అతణ్ణి దెప్పి పొడిచి అతని సగం ప్రాణాలు తోడేస్తాడు.

అతనిలో ఎలాంటి ఆత్మగౌరవం మిగలకుండా అగౌరవపరుస్తాడు. ఏదైనా జాతీయ కార్యక్రమంలో పాలుపంచుకుంటే మొట్టమొదట అతడు చూసేది అందులో తన ప్రయోజనం ఎంత ఉంది అనేది. అతనికెలాంటి లాభంగాని, ప్రయోజనం గాని కనబడని పనులన్ని అతని సహాయసహకారాలకు నోచుకోవు.

ఇలాంటి మనస్తత్వపు ఫలితాలు ఎలా ఉంటాయి? ఈ ఫలితాలు ఒక్క సామూహిక జీవితానికే ముప్పుగా పరిణమించవు, సరికదా తన సంకుచితత్వాన్ని, అజ్ఞానాన్ని తనకోసం లాభదాయకమైనదిగా అనుకునే ఆ వ్యక్తికి కూడా అవి ప్రమాదంగా పరిణమిస్తాయి. ప్రజల్లో ఇలాంటి మనస్తత్వం పొడసూపినప్పుడు కొందరి వద్దనే ధనం కేంద్రీకృతమవుతుంది. అనేక మంది నిరాధారులై పోతారు. ధనవంతులు డబ్బు బలంతో మరింత డబ్బును సంపాదిస్తారు. నిరుపేదల బ్రతుకులు రోజురోజుకూ మరింత దైన్యంగా మారిపోతాయి. ఏ సమాజంలోనైతే దారిద్ర్యం సర్వసాధారణమై పోతుందో అది రకరకాల చెడులకు ఆలవాలమై పోతుంది. ఆ సమాజం రోగగ్రస్తమవుతుంది. పనిచేసి సంపాదించే శక్తి సన్నగిల్లు తుంది. అజ్ఞానం పెరిగిపోతుంది. దాని నైతిక విలువలు పడిపోనారంభిస్తాయి. తన అవసరాలను తీర్చుకోవడానికి నేరాలకు పాల్పడుతుంది. చివరికి దోపిడీలకు దిగుతుంది. దొమ్మీలు సర్వసాధారణమైపోతాయి. ధనవంతులు హత్యలకు గురౌతూ ఉంటారు. వారి ఇళ్ళు దోచుకోబడతాయి, తగలబెట్టబడతాయి. చివరికి నామ రూపాల్లేకుండా నాశనమైపోతారు వారు.

మీరే గనక ఆలోచిస్తే, ప్రతి వ్యక్తి శ్రేయం తాను మనుగడ సాగిస్తున్న సమాజ శ్రేయంలోనే ముడివడి ఉంది అన్నది యదార్థం అని తెలుసుకోగలరు. మీ దగ్గరున్న డబ్బులో మీరు ఇతర సోదరులకు సహాయపడితే ఆ డబ్బు పరిభ్రమిస్తూ తిరిగి అనేక లాభాలతో మీ దగ్గరకే వచ్చి చేరుతుంది. మీరే గనక సంకుచిత మనస్సుతో దాన్ని ఖర్చుబెడితే అది చివరికి అంతరించి పోతుంది. ఉదాహరణకు, మీరు ఓ అనాధను పోషించారనుకోండి. విద్యాబుద్ధులు చెప్పించి అతణ్ణి మీరు సమాజంలో సంపాదనాపరుడైన ఓ వ్యక్తిగా తీర్చి దిద్దారనుకోండి. అప్పుడు మీరు సమాజ సంపదకు బలం చేకూర్చారన్నమాట. అలా సమాజ ధనంలో వృద్ధి జరిగిందన్న మాట. ఈ విధంగా సమాజ సంపద పెరిగినప్పుడు మీరు కూడా అందులోని ఓ సభ్యులే కాబట్టి మీ వాటా తప్పకుండా లభిస్తుంది. అయితే ఈ లాభం ఫలానా అనాధను పోషించినందుకు మీకు

లభించింది అని ఎలాంటి లెక్కల ద్వారా తెలియక పోయినా సరే. మీరే గనక సంకుచిత స్వభావంతో, స్వార్థంగా, నేను ఈ అనాథను ఎందుకు పోషించాలి, అతనికెందుకు సహాయం చేయాలి? అది అతని తండ్రి బాధ్యత అని అంటే అతడు పోకిరిగా, తిరుగుబోతుగా మారతాడు. ఓ పనికి మాలిన వానిగా తయారవుతాడు. తన కృషితో సమాజ సంపదను పెంచే సామర్థ్యం లేనివానిగా తయారవుతాడు. పైగా, అతడు నేరస్థుడుగా మారినా ఆశ్చర్యపడవలసిన పని కూడా లేదు. ఓ రోజున మీ ఇంటికే కన్నం వెయ్యొచ్చు. అంటే మీరు సమాజంలోని ఓ వ్యక్తిని పోకిరివానిగా, నేరస్థునిగా చేసి అతనికే కాదు మిమ్మల్ని నష్టానికి గురి చేసుకుంటున్నారన్న మాట. ఈ ఒక్క ఉదాహరణను దృష్టిలో ఉంచుకొని విశాల దృష్టితో గనక చూస్తే, ఎవరైతే స్వార్థ రహితంగా, సమాజ శ్రేయం కోసం డబ్బు ఖర్చుబెడతాడో అతని డబ్బు చూడ్డానికి జేబు నుండి బయటకు వచ్చేస్తుంది. కాని అది బయటకు వెళ్ళి మూడుపువ్వులు ఆరు కాయలుగా వృద్ధి చెందుతుంది. చివరికి ఎనలేని లాభాలతో తిరిగి అతని జేబులోనికే వచ్చేస్తుంది. మరెవరయితే స్వార్థం, లోభత్వంతో డబ్బును తన వద్దే కూడగడుతూ ఉంటాడో, సమాజ శ్రేయం కోసం చిల్లిగవ్వ కూడా ఖర్చు పెట్టడో, చూడ్డానికి అతని డబ్బు సురక్షితంగానే ఉంటుంది. లేక వడ్డీ వ్యాపారం వల్ల పెరుగుతుంది. కాని యదార్థంగా ఆ వ్యక్తి తన అవివేకం వల్ల డబ్బును క్షీణింప జేస్తున్నాడన్నమాట.

తన చేతులారా తన వినాశనాన్ని కొని తెచ్చుకుంటున్నాడు. ఈ రహస్యాన్నే అల్లాహ్ దివ్యఖుర్‌ఆన్‌లో ఇలా సెలవిస్తున్నాడు.

> *'అల్లాహ్ వడ్డీని నశింపజేస్తాడు, దాన ధర్మాలను పెంచి అధికం చేస్తాడు.'*
>
> *(అల్ బఖర: 276)*

> *ప్రజల సంపదలో చేరి పెరగాలని మీరు ఇచ్చే వడ్డీ అల్లాహ్ దృష్టిలో పెరగదు. అల్లాహ్ ప్రసన్నతను పొందే ఉద్దేశ్యంతో, మీరు ఇచ్చే జకాతు-దానిని ఇచ్చే వారే వాస్తవంగా తమ సంపదను వృద్ధి చేసుకుంటారు.*
>
> *(అర్ రూమ్: 39)*

అయితే ఈ రహస్యాన్ని తెలుసుకొని దానికి అనుగుణంగా నడుచుకో వడంలో మనిషికి సంకుచిత మనస్తత్వం, అతని అజ్ఞానం అడ్డుపడుతున్నాయి. మనిషి కేవలం జ్ఞానేంద్రియాలకు తట్టిందే సరైందని అనుకుంటాడు. ఏ డబ్బైతే తన లెక్కల ప్రకారం పెరుగుతోందో అది నిజంగా పెరుగుతోంది అని అనుకుంటాడు. కాని ఏ డబ్బైతే తాను వెచ్చిస్తాడో, అది ఎలా, ఎక్కడ ఎంత మోతాదులో పెరుగుతుందో, అది ఎప్పుడు తన వద్దకు లాభాలతో తిరిగి వస్తుందో అతనికి తెలియదు. అతడు అనుకునేది మాత్రం ఇంత డబ్బు నా చేత ఖర్చయిపోయింది అన్నది మాత్రమే.

ఈ అజ్ఞానపు ముడిని నేటి వరకు మనిషి తన బుద్ధి లేక ప్రయత్నంతో విప్పలేకపోయాడు. ప్రపంచ పరిస్థితి అంతా ఇదే. ఓ వైపు పెట్టుబడిదారుల లోకం ఉంది. అక్కడ పనులన్నీ వడ్డీ వ్యాపారం మీద నడుస్తున్నాయి. ధనాభి వృద్ధి ఎంత జరుగుతున్నా రోజు రోజుకు కష్టాలు కడగండ్లు పెరిగిపోతూనే ఉన్నాయి, మరోవైపు ఇంకో వర్గం ఉనికిలోనికి వచ్చి వృద్ధి చెందుతూ ఉంది. దాని మనస్సులోని అసూయా ద్వేషాలు రగులుతున్నాయి. ఈ వర్గం పెట్టుబడిదారుల ఖజానాలను దోచుకోవడానికి పూనుకోవడమే గాక మానవ నాగరికతను, సభ్యతను సయితం తలక్రిందులు చేద్దామనుకుంటోంది.

ఈ చిక్కు ముడిని అల్లాహ్ దివ్యఖుర్ఆన్‌లో విప్పి చూయించాడు. అల్లాహ్, పరలోకం పట్ల విశ్వాసమే ఈ లోకానికి తాళం చేయి. మనిషి అల్లాహ్‌ను విశ్వసించి, ఈ భూమ్యాకాశాల ధనాగారాలకు అసలు స్వామి ఆయనేనని, మానవ అవసరాల వ్యవస్థంతా అసలు దైవం చేతుల్లో ఉందని తెలుసుకోవాలి. అదే విధంగా ఆ దైవం వద్ద అణువణువుకు సంబంధించిన లెక్క ఉంది. మనిషి చేసే సకల సత్కర్మల పుణ్యఫలం, దుష్కర్మలకు చెడ్డ ఫలితం అంతా ఖచ్చితంగా పరలోకంలో లభిస్తుంది అని విశ్వసించాలి. అప్పుడు అతడు తన దృష్టిపై భరోసా చేసే బదులు దైవంపై భరోసా చేయడం సులభతరం అవుతుంది. తన ధనాన్ని దైవాదేశాల ప్రకారం ఖర్చుపెడతాడు. తన లాభ నష్టాల భారాన్ని దైవంపై వదిలేస్తాడు. ఈ విశ్వాసానికి తోడు, అతడు ఖర్చు చేసేది దైవానికి అర్పించినట్లే.

అతని దానం అంతా అల్లాహ్ పొందుపరచిన ఇతని ఖాతాలో జమ అవుతుంది. ప్రపంచంలో అతని దాన ధర్మాలను గురించి ఎవరికి తెలిసినా తెలియకపోయినా అది దైవం దృష్టిలో మాత్రం తప్పకుండా ఉంటుంది. ప్రపంచంలో అతడు చేసే మేళ్ళకు ఎవరు కృతజ్ఞతలు చూపకపోయినా దైవం మాత్రం అతని సత్కార్యాలకు తప్పకుండా విలువ ఇస్తాడు. ఇంకా దైవం వాటికి సత్ఫలితాలను ఇస్తాను అని వాగ్దానం చేశాడు కాబట్టి తప్పకుండా ఆ సత్ఫలితాలను ప్రసాదిస్తాడు అనే నమ్మకం ఉంది. ఆ ప్రతిఫలం పరలోకంలో లభించినా లేక ఉభయ లోకాల్లోను లభించినా సరే.

## దైవ మార్గంలో ఖర్చు పెట్టడం

ముస్లిము సోదరులారా! అల్లాహ్ తన షరీఅత్‌లో ఓ విధానాన్ని పెట్టాడు. దాని ప్రకారం ప్రజలు తమ జీవితంలో పుణ్యకార్యాలు సర్వ సాధారణంగా ఆచరించేందుకు ఆదేశాన్ని ఇచ్చాడు. అయితే ఆ పుణ్య కార్యానికి ఓ ప్రత్యేకమైన రూపాన్ని ఇచ్చి దాన్ని అవలంబించేందుకు మార్గం కూడా సుగమం చేస్తాడు. ఉదాహరణకు, అల్లాహ్ స్మరణ (జిక్ర్) ఓ పుణ్య కార్యం. ఇది అన్నిటికంటే గొప్ప పుణ్యకార్యమే కాకుండా ఇతర పుణ్యకార్యాలకు మూలం కూడాను. దీని సాధారణ ఆదేశం ఏంటంటే అల్లాహ్‌ను ఎల్లవేళలా స్మరిస్తూ ఉండడం మరవ వద్దన్నది.

> *"నిలుచున్నా, కూర్చున్నా, పరుండినా ఏ స్థితిలో వున్నా అల్లాహ్‌ను మటుకు స్మరిస్తూ ఉండండి. (అన్‌నిసా: 103) అల్లాహ్‌ను అత్యధికంగా స్మరించండి, మీకు విజయభాగ్యం కలుగుతుందని ఆశించవచ్చు. (అన్‌ఫాల్:45)*

> *"భూమి, ఆకాశాల సృష్టిలో రేయింబవళ్ళు ఒక దాని తరువాత ఒకటి రావటంలో, నిల్చున్నా, కూర్చున్నా, పరుండినా అన్ని వేళలా అల్లాహ్‌ను స్మరించే వారున్నూ, భూమీ, ఆకాశాల నిర్మాణం గురించి చింతన చేసే వారునూ అయిన వివేకవంతులకు ఎన్నో సూచనలు ఉన్నాయి. (వారు*

*అప్రయత్నంగా అంటారు) ప్రభూ! ఇదంతా నువ్వు వ్యర్థంగా, లక్ష్య రహితంగా సృష్టించలేదు." (ఆలి ఇమ్రాన్ : 190, 191)*

ఎవని మనస్సును మేము మా ధ్యానం పట్ల శ్రద్ధలేకుండా చేశామో, ఎవడు తన వాంఛలకు అనుగుణంగా వర్తించాడో, ఎవడి పనితీరు అతివాదంపై ఆధారపడి ఉంటుందో అటువంటి వ్యక్తి పట్ల విధేయత చూపకు. *(అల్ కహఫ్: 28)*

ఇవిగాక ఇలాంటి మరెన్నో వచనాల్లో ఎల్ల వేళలా అల్లాహ్ స్మరణను కొనసాగించమని చెప్పడం జరిగింది. ఎందుకంటే దైవ స్మరణే మనిషి కార్యకలాపాలను చక్కదిద్ది అతణ్ణి సన్మార్గంలో ఉంచగలదు. మనిషి ఆ స్మరణను వదిలేసిన వెంటనే మనో వాంఛలు, ఎనలేని దుష్ట భావాలు అతని మనస్సును ఆవరించుకుని పట్టి పీడిస్తాయి. ఫలితంగా అతడు మార్గ భ్రష్టుడై జీవన వ్యవహారాల్లో హద్దులు మీరి పోగలడు.

ఇది సాధారణ ఆదేశం. అయితే ఇప్పుడు ఈ దైవస్మరణకు సంబంధించిన ప్రత్యేకమైన రూపం నమాజు. ఆ నమాజుల్లోను అయిదు పూటల్లో కొన్ని రకాఅత్‌లు మాత్రమే ఫర్జు చేయబడ్డాయి. వాటిలో ఒక్కొక్కసారి అయిదు నుండి పది నిమిషాలకంటే ఎక్కువ సమయం పట్టదు. ఇలా పదేసి నిమిషాలు దైవ స్మరణను విధిగా చేయడం అంటే అంత సమయం మట్టుకే దైవాన్ని స్మరించండి. ఆ తరువాత ఆయన్ని మరిచిపొండి అని కాదు భావం. దీని అసలు ఉద్దేశ్యం ఏమిటంటే కనీసం అంత సేపటివరకైనా పూర్తిగా దైవ స్మరణలో నిమగ్నమై ఉండాలన్నదే. ఆ తరువాత మీరు ఏ పనిని చేస్తున్నా దాన్ని నిర్వహిస్తూనే దైవాన్ని స్మరిస్తూ ఉండాలి.

జకాత్ కూడా ఇలాంటిదే. ఇక్కడ కూడా ఒక ఆదేశం సాధారణమైనది, మరొకటి ప్రత్యేకమైనది. ఓ వైపు పిసినారితనం, సంకుచిత మనస్తత్వానికి దూరంగా ఉండండి, ఇది రుగ్మతకు మూలం, పాపాల పుట్ట అని చెబుతూ, ఎల్లవేళలా ఎనలేని సృష్టితాలపై కరుణా వృష్టిని కురిపిస్తున్న ఆ దైవగుణాన్ని

మీ నైతికతలో ఇముడ్చుకోండి. మీ అవసరాలకు పోగా ఎంత మిగుల్తుందో అంతవరకు మిగిలించి ఇతర దైవదాసుల అవసరాలను తీర్చండి. ధర్మ సేవలో, దైవ ధర్మోన్నతికి ధనప్రాణాల్ని సైతం లెక్కజెయ్యకుండా పాటు పడండి. మీకు దైవం ఎడల ప్రేమ ఉంటే ధన వ్యామోహాన్ని దైవ ప్రేమకై త్యాగం చెయ్యడానికి వెరువకండి అని చెప్పడం జరిగింది. ఇది ఓ సాధారణ ఆదేశం, దీనికి తోడు ఓ ప్రత్యేక ఆదేశం కూడా ఇవ్వడం జరిగింది. దీని ప్రకారం, ఓ నియమిత పరిమితికి (నిసాబ్) సమానమైన డబ్బు మీ దగ్గర ఉంటే దాన్నుండి కనీసం నిర్ణయించిన శాతాన్ని దైవ మార్గంలో తప్పకుండా ఖర్చు పెట్టాలి. ఇంత పంట మీ పొలంలో పండితే దాన్నుండి కనీసం ఇంత భాగం తప్పకుండా దైవానికి అర్పించాలి. కొన్ని రకాఅత్‌ల నమాజు ఫర్జ్ చేయడం అంటే ఆ నమాజు చేస్తున్నప్పుడే దైవాన్ని స్మరిస్తుండాలి అని అర్థం కాదు. మిగిలిన సమయాల్లో దైవాన్ని మర్చిపొండి అని ఎలా అనడం కుదరదో అలాగే ఇంత సొమ్ముగలవాళ్ళే దైవ మార్గంలో ఖర్చు పెట్టాలి. మిగిలిన వాళ్ళు మాత్రం తమ పిడికిళ్ళను బిగించి ఒక్క పైసా కూడా ఖర్చు పెట్టవద్దు అని భావం కాదు. ఇంకా, ధనవంతులపై ఎంత జకాత్ ఫర్జ్ అయిందో అంత మటుకే దైవ మార్గంలో ఖర్చు పెట్టి ఆ తరువాత ఎవరైనా అవసరం ఉండి వాళ్ళ దగ్గరికొస్తే అతణ్ణి కసిరి కొట్టడం లేక దైవ మార్గంలో ఖర్చు పెట్టే అవసరం ఏర్పడినప్పుడు మేము జకాత్ చెల్లించేశాం, ఇక మా వద్ద చిల్లిగవ్వ కూడా దొరకదు అని చెప్పడం కూడా కాదు. జకాత్ విధించడం అంటే భావం ఇది కాదు. కనీసం అంత సొమ్ము ప్రతి ధనవంతుడు తప్పకుండా ఇవ్వాల్సిందే. ఇంతకంటే అధికంగా ఖర్చు పెట్టే మార్గం ఉంటే అందులో ఖర్చుపెట్టాల్సిందే.

ఇప్పుడు నేను సాధారణ ఆదేశాల గురించి కొంచెం వివరణ ఇస్తాను. ఆ తరువాత మరో ప్రసంగంలో ప్రత్యేకమైన ఆదేశాల గురించి చెబుతాను.

దైవ గ్రంథం అయిన దివ్యఖుర్‌ఆన్ విశేషమేమిటంటే అది ఏ ఆదేశాలయితే ఇస్తుందో ఆ ఆదేశాల్లో దాగివున్న మేళ్ళను, ప్రయోజనాల్ని తానే విడమర్చి చెబుతుంది. ఇలా చెప్పడం వల్ల ఆ ఆదేశం ఎందుకు ఇవ్వడం జరిగిందో, దాని

ప్రయోజనం ఏమిటో తెలుసుకునేందుకు దివ్యగ్రంథం తెరువగానే మొట్టమొదట మనకు కనబడే వాక్యం:

*"ఇది అల్లాహ్ గ్రంథం. ఇందులో ఏ మాత్రం సందేహం లేదు. అల్లాహ్ భీతికల వారికి ఈ గ్రంథం మార్గదర్శకం - వారు అగోచరాలను విశ్వసిస్తారు, నమాజ్‌ను స్థాపిస్తారు. మేము ప్రసాదించిన దాన్నుండి (మా మార్గంలో) ఖర్చు చేస్తారు. (అల్ బఖర: 2,3)*

ఈ ఆయత్‌లో మూల సూత్రాన్ని చెప్పడం జరిగింది. ప్రపంచంలో సన్మార్గంపై నడవడానికి మూడు విషయాలు తప్పనిసరి. ఒకటి అగోచర విషయాల పట్ల విశ్వాసం, రెండోది నమాజ్ స్థాపించడం, మూడవది ఏ ఉపాధి అయితే మీకు అల్లాహ్ ప్రసాదించాడో దాన్నుండి ఆయన మార్గంలో ఖర్చు పెట్టడం. ఇదే ఆ అసలు విషయం. మరో చోట ఇలా సెలవివ్వడం జరిగింది.

*"మీరు అమితంగా ప్రేమించే వస్తువుల్ని (అల్లాహ్ మార్గంలో) ఖర్చుపెట్టనంత వరకు మీరు సత్కార్య స్థాయికి చేరుకోలేరు.*
*(ఆలి ఇమ్రాన్ : 92)*

ఆ తరువాత
*"దారిద్ర్య ప్రమాదం చూపి షైతాన్ మిమ్మల్ని భయపెడతాడు. నీతి బాహ్యమైన, నీచమైన మార్గం అవలంబించమని ప్రేరేపిస్తాడు."*
*(అల్ బఖర : 268)*

ఆపై ఇలా వుంది.
*"అల్లాహ్ మార్గంలో ఖర్చు పెట్టండి. చేతులారా మిమ్మల్ని మీరు వినాశం పాలు చేసుకోకండి." (అల్ బఖర : 195)*

చివరిగా ఇలా సెలవీయబడింది.
*"వాస్తవానికి హృదయలోభత్వం నుండి రక్షింపబడిన వారే సాఫల్యం పొందేవారు. (అల్ హష్ర్ : 9)*
అని చెప్పటం జరిగింది.

ఈ వాక్యాలన్నింటి ద్వారా తెలిసిన విషయం ఇది. ప్రపంచంలో మనిషి జీవితం గడపటానికి రెండు మార్గాలున్నాయి, మొదటిది దైవ మార్గం. ఇందులో సత్కార్యాలు, శుభాలు, సాఫల్యాలు, విజయాలున్నాయి. ఈ మార్గంలో నడవడానికిగల నియమనిబంధనల ప్రకారం మనిషి హృదయం విశాలమయి వుండాలి. ఏ ఉపాధి అయితే అతనికి అల్లాహ్ ప్రసాదించాడో - అది కొంచెమయినా అధికమైనా - అందులో నుండి అతడు తన అవసరాలను తీర్చుకుంటూ తన సోదరులకు కూడా సహాయపడాలి. అల్లాహ్ ధర్మవ్యాప్తి కోసమూ ఖర్చు పెట్టాలి. రెండో మార్గం షైతాను మార్గం. ఈ మార్గంలో బయటికి మాత్రం నలువైపులా మనిషికి లాభాలే కానవస్తాయి. నిజానికి ఇందులో మనిషి వినాశనం తప్ప మరేది లేదు. ఈ మార్గంలో నడవటానికి గల నియమాల ప్రకారం మనిషి సంపదను ప్రోగుచేసే ప్రయత్నం చెయ్యాలి. పైసా పైసాను తన ప్రాణం కంటే మిన్నగా చూసుకుంటూ దాన్ని ఖర్చు పెట్టకుండా దాచి పెట్టాలి. అది ఖర్చు అయినా తన స్వప్రయోజనానికి, తన మనోవాంఛలను తీర్చుకోవడానికి మాత్రమే ఖర్చు అవ్వాలి.

దైవ మార్గంపై నడిచే వారికి ఆ మార్గంలో ఖర్చు పెట్టడానికి ఏ యే విధానాలు చూపడం జరిగిందో వాటిని వరుసగా చెబుతాను.

మొదటి మాట ఏమిటంటే వెచ్చించడంలో దైవ ప్రసన్నత, ఆయన సంతోషాన్ని కోరడం. ఒకరి ఉపకారం చేయడానికిగాని పేరు ప్రతిష్టల కోసం గాని ఖర్చుపెట్ట కూడదు.

> *"అసలు మీరు ఖర్చు చేసేది అల్లాహ్ సంతోషం పొందటానికేగా."*
>
> *(అల్ బఖర : 272)*

> *"విశ్వసించిన ఓ ప్రజలారా! కేవలం పరుల మెప్పును పొందటానికే తన ధనం ఖర్చు చేసేవాని మాదిరిగా అల్లాహ్‌నూ, అంతిమ దినాన్నీ విశ్వసించని వాని మాదిరిగా, మీరు దెప్పి పొడిచి, గ్రహీత మనస్సును గాయపరచి మీ దాన ధర్మాలను మట్టిలో కలపకండి. అతడు చేసిన ధన వ్యయాన్ని ఈ*

విధంగా పోల్చవచ్చు; ఒక కొండరాతిపై ఒక మట్టి పొర ఏర్పడి వుంది. భారీ వర్షం దానిపై కురవగా ఆ మట్టి కాస్తా కొట్టుకు పోయింది. చివరకు మిగిలింది ఉత్త కొండరాయి మాత్రమే." (అల్ బఖర : 264)

రెండో మాట, ఒకరికి దానమిచ్చి లేక వస్త్రాలు పెట్టి వారి మనస్సు నొచ్చుకునేటట్లు దెప్పి పొడవకుండా ఉండడం.

"అల్లాహ్ మార్గంలో తమ ధనాన్ని వ్యయం చేసి, ఆ తరువాత తమ దాతృత్వాన్ని మాటి మాటికీ చాటుతూ, గ్రహీతల మనస్సును గాయపరచని వారి ప్రతిఫలం వారి ప్రభువు వద్ద వుంది, వారికి ఏ విధమైన భయం గాని, ఖేదంగాని ఉండవు. మనస్సును గాయపరిచే దానం కంటే మృదు భాష్యం, క్షమాగుణం ఎంతో మేలైనది." (అల్ బఖర : 262)

మూడో మాట, దైవ మార్గంలో మేలైన దానినే ఖర్చు పెట్టడం. పనికి మాలిన వస్తువును ఏరి ఇవ్వకుండా ఉండడం. పేద వారికి ఇవ్వడానికి ఎవరయితే పాతవి, చినిగిన బట్టలు ఇస్తారో లేక ఓ బిచ్చగానికి పెట్టడానికి చెడిపోయిన అన్నం ఉంచుతారో అలాంటి వారికి కూడా అలాంటి ప్రతిఫలమే లభిస్తుంది.

"విశ్వసించిన ప్రజలారా! మీరు సంపాదించిన ధనంలోని, మేము మీ కొరకు నేల నుండి ఉత్పత్తి చేసిన దానిలోని మేలైన భాగాన్ని దైవ మార్గంలో ఖర్చుపెట్టండి. ఆయన మార్గంలో ఇవ్వటానికి పనికిరాని వస్తువుల్ని ఏరి తీసే ప్రయత్నం చెయ్యకండి." (అల్ బఖర : 267)

నాలుగో మాట సాధ్యమైనంత మట్టుకు ఎవరికీ కనబడకుండా దానం చెయ్యడం. ప్రదర్శనా బుద్ధి లేకుండా ఉండడం. కనబడేటట్టు దానం చెయ్యడంలో తప్పులేదు గాని దాచి ఇవ్వడం ఉత్తమం.

"మీరు మీ దాన ధర్మాలను బహిరంగంగా చేసినా మంచిదే. కాని రహస్యంగా నిరుపేదలకు దానిమివ్వటం మీకు ఎక్కువ మేలు

*చేకూరుస్తుంది. మీ దుష్కార్యాలు ఎన్నో దీనివల్ల సమసిపోతాయి.”*
*(అల్ బఖర : 271)*

అయిదో మాట, బుద్ధిమాంద్యం కల వారికి, అవివేకులకు వారి అవసరాన్ని మించి ఇవ్వకుండా ఉండాలి. అలా జరగకపోతే వారు చెడి పోవచ్చు, దురలవాటులకు బానిసలు కావచ్చు. తిండి బట్ట ఎంత చెడ్డ వానికయినా, ఎంత దుష్టునికయినా లభించాలన్నదే అల్లాహ్ అభీష్టం. అయితే మత్తు పానీయాలకు, మాదక ద్రవ్యాలకు అలవాటుపడ్డ వారికి, జూదరులకు, పోకిరీలకు డబ్బు ఇవ్వడం సరికాదు.

> *“అల్లాహ్ మీకు జీవనాధారంగా చేసిన సంపదను అవివేకులకు అప్పగించకండి. అయితే దాన్నుండి వారికి అన్న వస్త్రాలు కల్పించండి. వారికి హితబోధ చెయ్యండి.” (అన్నిసా : 5)*

ఆరోది, ఓ పేదవానికి అతని అవసరం తీరడానికి అప్పు ఇస్తే ఘాటిమాటికి అడిగి అతణ్ణి బాధించకుండా ఉండాలి. అతనికి సులువుగా తీర్చుకోగలిగేంత వెసులుబాటు ఇవ్వాలి. అతడా అప్పును తీర్చలేని స్థితిలో వుంటే మాఫీ చేయగలిగేటంత స్థితిలో మీరుంటే అతణ్ణి మాఫీ చెయ్యడం ఉత్తమం.

> *“మీ బాకీదారుడు ఆర్థిక ఇబ్బందుల్లో వుంటే అతని పరిస్థితి మెరుగు పడే వరకు గడువు ఇవ్వండి. లేక మీరు తెలిసిన వారే అయితే, ఆ బాకీని అతనికి దానం చెయ్యండి.” (అల్ బఖర : 280)*

ఏడవ విషయం, మనిషి దానం చెయ్యడంలోనూ మితిమీరకుండా ఉండాలి. తనకూ, తన వారికి లేకుండా ఉన్నదంతా దానం చెయ్యమని కాదు అల్లాహ్ అభీష్టం. ఆయన కోరేదల్లా నిరాడంబరంగా జీవితం గడపటానికి అవసరమైనది తన కోసం, తన భార్యా పిల్లల కోసం వెచ్చించి మిగిలింది దైవ మార్గంలో ఖర్చు చెయ్యడం.

“మేము అల్లాహ్ మార్గంలో ఏమి ఖర్చు పెట్టాలి” అని వారడుగుతారు.

మీ నిత్యావసరాలకు పోగా మిగిలినది అని నీవు వారికి సమాధానం చెప్పు." *(అల్ బఖర : 219)*

"పుణ్యాత్ములయిన దైవదాసులు ఎవరంటే ఖర్చు పెడితే, దుబారాగానూ ఖర్చు పెట్టకుండా, లోభత్వాన్నీ ప్రదర్శించకుండా ఈ రెండు తీవ్ర వైఖరుల మధ్య సమతూకాన్ని పాటించే వారు." *(అల్ ఫుర్ఖాన్ : 67)*

మీ చేతిని మెడకు బంధించీ ఉంచకండి, దానిని పూర్తిగా స్వేచ్ఛగానూ వదలిపెట్టకండి. అలా చేస్తే నిందలపాలవుతారు, దిక్కులేని వారవుతారు. *(బనీ ఇస్రాయీల్ : 29)*

చివరిగా అగత్యపరుల పూర్తి పట్టిక కూడా తెలపడం జరిగింది. దీన్ని చూసి మీరు మీ సహాయానికి అర్హులెవ్వరో, అల్లాహ్ మీ సంపాదనలో ఎవరి హక్కును ఉంచాడో తెలుసుకోగలరు.

"బంధువుల పట్ల మీ విధులను నిర్వహించండి. పేదవారి పట్ల, బాటసారుల పట్ల, మీ విధులను నిర్వర్తించండి." *(బనీ ఇస్రాయీల్ : 26)*

"ఇంకా అల్లాహ్ పట్ల ప్రేమతో, తాము ఎక్కువగా ఇష్టపడే ధనాన్ని బంధువుల కొరకు, అనాధుల కొరకు, నిరుపేదల కొరకు, బాటసారుల కొరకు, సహాయం చెయ్యమని అర్థించే వారి కొరకు, ఖైదీలను విడుదలచేయటానికీ వ్యయపరచడం." *(అల్ బఖర : 177)*

"తల్లిదండ్రుల యెడల సద్భావంతో మెలగండి. బంధువులూ, అనాధులూ, నిరుపేదలపట్ల మంచిగా వ్యవహరించండి. పొరుగున వున్న బంధువులు, అపరిచితులైన పొరుగువారు, ప్రక్కనున్న మిత్రులు, బాటసారులు, మీ ఆధీనంలో వున్న దాస - దాసీ జనం పట్ల ఉదార బుద్ధితో వ్యవహరించండి." *(అన్ నిసా : 36)*

"ఇంకా పుణ్యాత్ములు, అల్లాహ్ మీది ప్రేమతో పేదలకూ, అనాధలకూ,

ఖైదీలకూ అన్నం పెట్టేవారు. (వారు వారితో ఇలా అంటారు). 'మేము కేవలం అల్లాహ్ కోసమే మీకు అన్నం పెడుతున్నాము. మేము మీ నుండి ఎలాంటి ప్రతిఫలాన్ని గానీ, కృతజ్ఞతలను గానీ ఆశించటం లేదు. దుర్భరమైన ఆపదలతో కూడుకున్న సుదీర్ఘమైన రోజున మా ప్రభువు విధించే శిక్ష గురించి మేము భయపడుతున్నాము.'' *(అద్దహ్ర్ 8 -10)*

*'వారి సంపదలో యాచకులకూ, అగత్యం కలవారికీ హక్కు ఉండేది.'*

*(అజ్ జారియాత్ : 19)*

*"అల్లాహ్ కార్యంలో నిమగ్నులైన కారణంగా, తమ జీవనోపాధి కోసం భూమిపై తిరిగే అవకాశం లేనందువల్ల లేమికి గురిఅయిన వారు ప్రత్యేకంగా ధన సహాయానికి అర్హులు. వారిని ఎరుగని మనిషి వారి ఆత్మాభిమానం చూసి వారు భాగ్యవంతులని భావిస్తాడు. వారి ముఖాలను చూసి మీరు వారి నిజస్థితిని గ్రహించగలరు."* *(అల్ బఖర : 273)*

# జకాత్ ఆదేశాలు

ముస్లిం సోదరులారా! గత ప్రసంగంలో "ఇన్ఫాఖ్ ఫీసబీలిల్లాహ్" (దైవ మార్గంలో ఖర్చుపెట్టడం)కు సంబంధించిన సాధారణ ఆదేశాలను మీ ముందుంచాను. ఇప్పుడు నేను జకాత్‌కు సంబంధించిన ఆదేశాల రెండో భాగాన్ని అంటే ఫర్జ్ చెయ్యబడిన భాగాన్ని గురించి విశదంగా వివరిస్తాను.

1. బఖర సూరాలో ఇలా ఉంది :

"మీరు సంపాదించిన ధనంలోని, మేము మీ కొరకు నేల నుండి ఉత్పత్తి చేసిన దానిలోని మేలైన భాగాన్ని దైవ మార్గంలో ఖర్చు పెట్టండి."

*(2 : 267)*

*2. అన్ఆమ్ సూరాలో -*

*"మీ కోసం మేము భూమి నుండి తోటలను, పంటలను. పండించాము.*

*కాబట్టి అవి పండినప్పుడు వాటి పంటను తినండి. వాటి పంటను కోసేటప్పుడు మీపై వున్న అల్లాహ్ హక్కును చెల్లించండి." (6 : 141)*

ఈ రెండు ఆయత్‌లు పంటకు సంబంధించినవి. హనఫీ ధర్మవేత్తలు, దానంతట అదే పుట్టి పెరిగిన పంట ఉదాహరణకు కట్టె, గడ్డి, వెదురు తప్ప మిగిలినవి ధాన్యం, కూరగాయలు, పండ్లకు సంబంధించిన వాటన్నింటినుండి అల్లాహ్ హక్కు చెల్లించవలసి వుంటుంది అని అంటారు. హదీసులో, ఏ పంట అయితే కేవలం వర్షాధారంగా పండుతుందో అందుండి పదో వంతు, మరే పంట అయితే మనిషి కృషి వల్ల జరిగే నీటి పారుదలతో పండుతుందో అందులో దైవం హక్కు ఇరవయ్యో వంతు (అంటే ఐదుశాతం) పై రెంటిలోనూ పంట కోత అయిన వెంటనే వాజిబ్ అవుతుందని చెప్పడం జరిగింది.

3. ఆ తరువాత తౌబా సూరాలో ఇలా ఉంది.

*"వెండి బంగారాలను పోగుచేసి వాటిని దైవ మార్గంలో ఖర్చు పెట్టని వారికి వ్యధాభరితమైన శిక్ష యొక్క శుభవార్తను అందజెయ్యండి. ఈ వెండి బంగారాలు నరకాగ్నిలో కాల్చబడే ఒక రోజు వస్తుంది. వాటితోనే వారి నొసటిపై, వారి పార్శ్వాలపై, వీపులపై వాతలు వెయ్యబడతాయి. ఇది మీరు మీ కొరకు కూడబెట్టుకున్నది ఇదిగో, ఇక మీరు కూడబెట్టిన సంపదను రుచి చూడండి. (9 : 34, 35)*

మరో చోట -

*"జకాత్ నిధులు అసలు కేవలం నిరుపేదలకు, అక్కరలు తీరని వారికి, జకాత్ వ్యవహారాలకై నియుక్తులైన వారికీ ఇంకా ఎవరి హృదయాలను గెల్చుకోవటం అవసరమో వారికీ ఇంకా బానిసల విముక్తికీ, ఋణగ్రస్తుల సహాయానికీ దేవుని మార్గంలోనూ, బాటసారుల ఆతిధ్యానికీ వినియోగించటం కొరకు, ఇది అల్లాహ్ తరపు నుండి నిర్ణయించబడిన ఒక విధి. అల్లాహ్ అన్నీ ఎరిగినవాడూ, వివేకవంతుడూను." (9 : 60)*

ఆ తరువాత పదమూడవ రుకూలో ఇలా వుంది.

*"ఓ ప్రవక్తా! మీరు వారి సంపదలనుండి సదఖా తీసుకొని వారిని పరిశుద్ధపరచండి." (9 : 103)*

పై మూడు వాక్యాల ద్వారా తెలిసిందేమంటే ఏ ధనాన్నయితే కూడబెట్టడం జరిగిందో లేక వృద్ధి కావించడం జరిగిందో అందుండి దైవ మార్గంలో వెచ్చించకుండా వుంటే అది అపరిశుద్ధమయిన సంపద. దానిని పరిశుద్ధపరిచే మార్గం కేవలం అందుండి దైవ హక్కును తీసి ఆయన దాసులకు చెల్లించడం.

హదీసు ప్రకారం, వెండి బంగారాలు కూడబెట్టే వారు శిక్షకు గురవుతారు అన్న గద్దింపు వచ్చిన తోడనే ముస్లింలు ఎంతో భయభ్రాంతులకు లోనయ్యారు. ఓ దిర్హమ్ కూడా దగ్గర ఉంచుకోకూడదు, అంతా ఖర్చు పెట్టేయమని దీని భావం. చివరికి హజ్రత్ ఉమర్ (రజిఅన్) దైవ ప్రవక్త (సఅసం) సన్నిధికి హాజరై జాతి భయభీతుల్ని ఏకరవు పెట్టారు. అప్పుడాయన, "అల్లాహ్ జకాత్‌ను మీపై అందుకే ఫర్జ్ చేశాడు, మిగిలిన సంపద అంతా పరిశుద్ధమై పోతుంది" అని ప్రవచించారు. ఇలాంటి ఉల్లేఖనమే మరొకటి హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజిఅన్) ఉల్లేఖించారు. దైవప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు 'ఎప్పుడయితే నీవు నీ సంపదనుండి జకాత్ తీశావో నీపై వాజిబ్ అయిన ఆ హక్కు నెరవేరింది.'

పైన చెప్పిన ఖురాన్ వాక్యాల్లో కేవలం పంట, వెండి-బంగారాలపై జకాత్‌కు సంబంధించిన ఆదేశమే లభిస్తుంది. అయితే హదీసుల ద్వారా, వ్యాపార సామాగ్రి, ఒంటెలు, ఆవులు మరియు మేకల్లోను జకాత్ వుంది అని తెలుస్తోంది.

వెండి 'నిసాబ్' (పరిమాణం) రెండు వందల దిర్హములు. అంటే దాదాపు 52 1/2 తులాలు. బంగారం నిసాబ్ ఏడున్నర తులాలు. ఒంటెల నిసాబ్ అయిదు ఒంటెలు.

మేకలనిసాబ్ - 40 మేకలు. ఆవుల నిసాబ్ - 30 ఆవులు. అదే విధంగా వ్యాపార సామాగ్రి నిసాబ్ 52 1/2 తులాల వెండికి సమానమైన సామగ్రి.

ఒకరివద్ద ఈ పరిమితికి సమానమైన సంపద ఓ సంవత్సరకాలం పాటు నిల్వ వుంటే అందులో నుండి నలభయ్యో వంతు (రెండున్నర శాతం) జకాత్ తీయడం వాజిబ్. ఇమామ్ అబూ హనీఫా దృష్టిలో, వెండి బంగారాలు విడివిడిగా నిసాబ్ పరిమితిలోనికి రాకపోయినా ఆ రెండు కలిసి ఏదో ఒకదానికి సమానమైన పరిమితికి చెందితే ఆ రెంటిపైనా జకాత్ తీయడం వాజిబ్.

వెండి-బంగారాలు ఒకవేళ ఆభరణాల రూపంలో వుంటే, హజ్రత్ ఉమర్ (రజిఅన్) మరియు హజ్రత్ ఇబ్నె మస్ఊద్ (రజిఅన్)ల దృష్టిలో వాటి జకాత్ చెల్లించడం విధి (ఫర్జ్). ఇమామ్ అబూ హనీఫా (రహ్మాలై) కూడా దీన్నే ఆధారంగా తీసుకున్నారు. హదీసులో, దైవ ప్రవక్త (సఅసం) ఇరువురు స్త్రీల ముంజేతులకు బంగారు మురుగులుండగా చూసి మీరు దీని జకాత్ చెల్లిస్తున్నారా అని అడిగారు. ఒకామె లేదు అనగా "ప్రళయదినం నాడు దీనికి బదులుగా నీకు అగ్ని మురుగులు తొడిగించడం ఇష్టమా అని అడిగారు". ఇదే విధంగా హజ్రత్ ఉమ్మె సల్మా (రజిఅన్హా) ఉల్లేఖనం ప్రకారం, ఆమె వద్ద బంగారపు పట్టీలుండేవి. ఆమె దైవ ప్రవక్త (సఅసం)ను ఇది కూడా ధనం క్రిందికే వస్తుందా అని అడిగారు. దానికి ఆయన ఇందులోని బంగారు జకాత్ పరిమితి (నిసాబ్) వరకు చేరి అందుండి జకాత్ చెల్లించబడితే అది ధనం కాదు అని నుడివారు.

పై రెండు హదీసుల ద్వారా తెలిసిందేమిటంటే వెండి-బంగారాలు నగల రూపంలో వున్నా సరే వాటిపై కూడా నగదు రూపంలో ఎలా జకాత్ చెల్లించడం విధియో అలానే ఫర్జ్. అయితే వజ్ర వైఢూర్యాలపై జకాత్ ఉండదు.

దివ్యఖుర్ఆన్‌లో, జకాత్ దానం గ్రహించడానికి ఎనిమిది రకాల మనుషులు హక్కుదారులుగా చెప్పడం జరిగింది. వారి వివరాలు ఇలా వున్నాయి.

1. పుక్‌రా: వీరు ఏ విధమైన డబ్బుగాని, సంపదగాని లేని వాళ్ళు. వారి సంపాదన వారి భుక్తికి కూడా సరిపోకుండా ఉంటుంది. దారిద్ర్యంలో జీవితం గడిపేవారు వీరు. ఎవరినీ యాచించరు. ఇమామ్ జుహ్రీ,

ఇమామ్ అబూహనీఫా, ఇబ్నె అబ్బాస్, హసన్ బస్రీ, అబుల్ హసన్ కర్ఖీ (రహ్మతుల్లా అలైహి), మరి ఇతర ధర్మవేత్తలు ఫకీరు పదాన్ని పైవిధంగానే నిర్వచించారు.

2. మసాకీన్ : వీరు మరీ దారిద్ర్యాన్ని అనుభవించే వాళ్ళు. వారి దగ్గర కనీసం తమ శరీరాచ్ఛాదన కోసం, తమ అవసరాలను తీర్చుకోవడానికి కూడా ఏమీ లేనటువంటి వాళ్ళు. హజ్రత్ ఉమర్ (రజి.అన్) సంపాదించే శక్తి కలిగి ఉన్నా ఉపాధి లభించని వాళ్ళను కూడా 'మసాకీన్'లో చేర్చారు.

3. **ఆమిలీన అలైహా: అంటే వీరు ఇస్లామీయ ప్రభుత్వంలో జకాత్ వసూలు చేయడానికి నియమించబడిన వాళ్ళు. వీరికి జకాత్ పద్దు నుండే జీత భత్యాలు చెల్లించబడతాయి.**

4. ముఅల్లఫతుల్ ఖులూబ్ : ఇస్లామ్‌ను బలపర్చే వారూ లేక ఇస్లామ్ వ్యతిరేకతను అడ్డుకొనే వారూ అని అర్థం. ఇంకా కొత్తగా ఇస్లామ్ స్వీకరించిన వారు కూడా ఈ కోవలోకే వస్తారు. వీరందరి కొరకు జకాత్ నుండి ఖర్చుపెట్టాలి. ఇంకా, ఎవరైనా తిరస్కార జాతిని వదిలేసి ముస్లిములలోనికి వచ్చి చేరిన కారణంవల్ల అతడు నష్టాలకు గురైనప్పుడు అతణ్ణి ఆదుకోవడం ముస్లిముల విధి. అతడు ధనవంతుడైనాసరే, అతనికి జకాత్ ఇవ్వవచ్చు. 'హునైన్' యుద్ధంలో దైవ ప్రవక్త (సఅసం) నవ ముస్లిములకు యుద్ధ ధనం నుండి ఉదారంగా బహూకరించారు. ఒక్కొక్కరి భాగానికి వందేసి ఒంటెలు వచ్చాయి. ఇది 'అన్సారు'లకు రుచించలేదు. అప్పుడు దైవ ప్రవక్త (సఅసం), 'వీళ్ళు ఇప్పుడిప్పుడే తిరస్కారం నుండి ఇస్లామ్‌లోనికి వచ్చారు. నేను వారిని తృప్తిపరచదలిచాను' అన్నారు. ఈ కారణంగానే ఇమామ్ జుహ్రి (రహ్మాలై) ముఅల్లఫతుల్ ఖులూబ్‌ని ఇలా నిర్వచించారు.

"ఏ క్రైస్తవుడైనా, యూదుడైనా, ముస్లిమేతరుడైనా ఇస్లామ్‌లో ప్రవేశిస్తే **అతడు ధనవంతుడైనా సరే ముఅల్లఫతుల్ ఖులూబ్ కోవకు చెందుతాడు.'**

5. ఫిర్-రిఖాబ్ : బానిసత్వ బంధనాల నుండి విముక్తి కాదలిచిన వాడికి జకాత్ ఇచ్చి విడిపించవచ్చు. ఈ కాలంలో బానిసత్వ ఆచారం లేనందువల్ల, నా అభిప్రాయంలో, ఖైదు అనుభవించేవారిని జరిమానా చెల్లించి విడిపించడం, వీలు పడితే వారికి జకాత్ ఇచ్చి సహాయపడవచ్చు. ఇది కూడా ఫిర్-రిఖాబ్ కోవకే చెందుతుంది.

6. అల్ గారిమూన్: రుణగ్రస్తులు ఒకరివద్ద వేయి రూపాయలు ఉండి, అతనికి ఒక వంద రూపాయల అప్పు వుంటే, అతనికి కూడా జకాత్ ఇవ్వాలని దీని అర్థం కాదు. ఒక వ్యక్తి తన అప్పు తీర్చిన తరువాత అతని వద్ద నిసాబ్ పరిమితి కంటే తక్కువ ధనం మిగిలితే అతనికి జకాత్ ఇవ్వవచ్చు అన్నది దీని భావం. ఎవరైతే దుబారా ఖర్చులు, వ్యభిచారం ద్వారా రుణగ్రస్తుడౌతాడో అతనికి జకాత్ ఇవ్వడం మక్రూహ్ అని ధర్మవేత్తలు చెప్పారు. ఎందుకంటే అతడు జకాత్ దానం పొంది ఆ అప్పులను తీర్చుకోగలను అనే ఆశపై మరింత ధైర్యంగా వ్యభిచారం, దుబారాల్లో చిక్కుకోవచ్చు.

7. ఫీసబీలిల్లాహ్ : ఈ పదం అన్ని రకాల సత్కార్యాలకోసం వాడబడే సాధారణ పదం. అయితే సత్య ధర్మ పతాకాన్ని ఉన్నతం చేయడానికి, దాని ప్రచారానికి జరిగే ప్రయత్నాల్లో సహాయపడడం అనే భావంలో ప్రత్యేకంగా వాడబడుతుంది. దైవప్రవక్త (సఅసం) గారి ఓ ప్రవచనం ఇలా ఉంది.

"జకాత్ గ్రహించడం ధనవంతులకు ధర్మసమ్మతం కాదు. అయితే ఆ ధనవంతునికి 'జిహాద్' చేయడం కోసం డబ్బు అవసరం వస్తే అతనికి జకాత్ ఇవ్వవచ్చు. ఎందుకంటే అతడు ధనవంతుడే అయినా జిహాద్‌లోని అసాధారణ ఖర్చుల్ని భరించలేకపోతాడు. కాబట్టి జకాత్ ఇచ్చి అతణ్ణి ఆదుకోవాల్సి ఉంటుంది."

8. ఇబ్నుస్సబీల్ : అంటే బాటసారి. బాటసారి తన స్వంత వూరిలో ఎంత

సంపన్నుడైనా ప్రయాణంలో గనక అతనికి డబ్బు అవసరమైతే అతనికి జకాత్ ఇవ్వవచ్చు.

ఇప్పుడు పైన జెప్పిన ఎనిమిది రకాల వ్యక్తుల్లో ఎవరికి ఏ పరిస్థితుల్లో జకాత్ ఇవ్వవచ్చు, ఎలాంటి పరిస్థితుల్లో జకాత్ ఇవ్వకూడదు అన్న ప్రశ్న వస్తుంది. ఈ ప్రశ్నలకు సంబంధించిన కొంత వివరణ కూడా మీకు వివరిస్తాను.

1. ఏ వ్యక్తి కూడా తన తండ్రికి లేక కుమారునికి జకాత్ ఇవ్వకూడదు. భార్య తన భర్తకు, భర్త తన భార్యకు జకాత్ ఇవ్వకూడదు. ఇది ధర్మవేత్తలందరి ఏకాభిప్రాయం. కొందరు ధర్మవేత్తలయితే (ఫుఖహా) ఏ దగ్గరి బంధువుల పోషణ బాధ్యత అయితే ఉందో లేక షరీఅత్ ప్రకారం వారసులో వారికి కూడా జకాత్ ఇవ్వవద్దని చెబుతారు. అయితే దూరపు బంధువులు జకాత్‌కు హక్కుదారులు. ఆ హక్కులో వారికి ఇతరులకంటే ఎక్కువ ప్రాధాన్యత ఉంది. కాని ఇమామ్ అవుజాయి (రహ్మాలై) మాత్రం, జకాత్ డబ్బు తీసి కేవలం బంధువుల్నే వెదుక్కుంటూ తిరగొద్దు అని అంటారు.

2. జకాత్ అన్నది కేవలం ముస్లిముల హక్కు. ముస్లిమేతరులకు ఇందులో ఎలాంటి హక్కు లేదు. హదీసులో దీనిని ఇలా నిర్వచించడం జరిగింది.

"అది మీ ధనవంతుల నుండి గ్రహించబడుతుంది. మరియు మీలోని అగత్యపరుల్లో పంచబడుతుంది."

అయితే ముస్లిమేతరులకు సాధారణ దానధర్మాలనుండి భాగం ఇవ్వాలి. సాధారణ దానధర్మాలకు ముస్లిములు ముస్లిమేతరుల మధ్య భేదభావం పాటించకూడదు.

3. ఇమామ్ అబూ హనీఫా, ఇమామ్ యూసుఫ్, ఇమామ్ ముహమ్మద్ (రహ్మాలైలు) ఏ బస్తీలోని జకాత్ ఆ బస్తీ(గ్రామం)లోని నిరుపేదల్లోనే ఖర్చు కావాలని, ఓ ఊరి నుండి మరో ఊరికి పంపించడం మంచిది కాదని చెప్పారు.

అయితే అక్కడ అర్హులు లేకపోయినా లేక మరో ప్రదేశంలో వరదలు, కరువుకాటకాల్లాంటి విపత్తు వచ్చి చుట్టుపట్ల గ్రామాల నుండి సహాయం తప్పక అందవలసి వచ్చినా ఇతర ప్రదేశాలకు జకాత్ పంపాలి. ఇమామ్ మాలిక్, ఇమామ్ సుఫ్యాన్ సౌరి (రహ్మాలై)ల అభిప్రాయం కూడా ఇదే. ఇంతకూ ఒకచోటి నుండి మరో చోటికి జకాత్ పంపించడం నిషిద్ధం కాదు.

4. ఒకరి వద్ద రెండు పూటల తిండికి సరిపడ సామగ్రి ఉంటే వారు జకాత్ దానాన్ని తీసుకోరాదు అని కొందరు పెద్దలు అభిప్రాయపడతారు. కొందరు పది రూపాయలు మరికొందరు పన్నెండున్నర రూపాయలు వున్నా జకాత్ తీసుకోరాదని అంటారు. కాని ఇమామ్ అబూ హనీఫా (రహ్మాలై) మరియు ఇతర హనఫీ ధర్మవేత్తల అభిప్రాయం ప్రకారం, యాభై రూపాయలకంటే తక్కువ సొమ్ము ఉన్నవారు కూడా జకాత్ దానాన్ని పొందవచ్చు.* ఇందులో ఇల్లు, ఇంటి సామగ్రి (గృహోపకరణాలు), గుర్రం, నౌకరు లెక్కలోనికిరావు. ఇవన్నీ కలిగి వున్నా యాభై రూపాలయకంటే తక్కువ డబ్బుగలవాడు కూడా జకాత్ దానాన్ని పొందవచ్చు అని భావం. గమనించవలసిందేమిటంటే, చట్టమన్నది ఒకటి, ఉన్నతస్థాయి ఆచరణ అనేది మరొకటి. ఉన్నత ఆచరణ ఈ రెంటిలోను తేడా ఉంది. ప్రవక్త (సఅసం) సూచించింది అదేమంటే :

"ఎవరైతే ఉదయం సాయంత్రం రెండు పూటలా భోజన సామగ్రి కలిగి ఉండి యాచిస్తాడో అతడు తన కోసం అగ్ని ప్రోవుచేసుకుంటున్నాడు." మరో హదీసులో ఇలా ప్రవచించడం జరిగింది.

"ఒకడు చేయి జాపి ఒకరిని యాచించే దాని కంటే కట్టెలు కొట్టి కడుపునింపుకోవడమే నా కిష్టం."

మూడో హదీసు ప్రకారం :

"తినడానికి తిండి వున్నవాడు, సంపాదించే శక్తి ఉన్నవాడు జకాత్

---

☆ *ఈ ప్రసంగాలు 1938వ సంవత్సరంలో చేయబడ్డాయి అని పాఠకులు గ్రహించగలరు.*

తీసుకోరాదు" అని ఉంది. అయితే ఇది ఉన్నతస్థాయి నడవడి. ఇక చట్టం గురించి చెప్పాలంటే అందులో, మనిషి ఏ మేరకు జకాత్ తీసుకోడానికి అర్హుడు అన్న చివరి హద్దును చూపవలసి ఉంటుంది. అది ఇతర హదీసుల్లో మనకు లభిస్తుంది. ఉదాహరణకు దైవప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు.

"అర్థించేవాడు గుర్రమెక్కి వచ్చినా అది ఆయన హక్కు."

ఓ వ్యక్తి దైవ ప్రవక్త (సఅసం)ను అడిగాడు. నా వద్ద పది రూపాయలున్నాయి. నేను నిరుపేదనా? దానికి అవును అని జవాబిచ్చారు దైవప్రవక్త (సఅసం). ఒకసారి ఇద్దరు వ్యక్తులు వచ్చి దైవ ప్రవక్తను జకాత్ దానం అడిగారు. వారివైపు తేరిపారచూసి, మీరు తీసుకోదలిస్తే నేనిస్తాను. కాని ఈ సొత్తులో డబ్బున్న వారికి, కష్టపడి సంపాదించగల వారికి భాగం మాత్రం లేదు అన్నారు. ఈ హదీసులన్నింటి దృష్ట్యా, ఎవడైతే నిసాబ్ పరిమితి కంటే తక్కువ స్తోమత కలిగి ఉంటారో వారు 'అగత్యపరుల' కోవకు చెందుతారు. వారికి జకాత్ ఇవ్వవచ్చు. అయితే జకాత్‌ను తీసుకునే హక్కు మాత్రం దాని నిజమైన అగత్యపరులకే చెందుతుంది.

జకాత్‌కు సంబంధించిన ముఖ్య ఆదేశాలను నేను తెలియజేశాను. అయితే దానికి తోడు ముఖ్య విషయం మరొకటుంది. మీ దృష్టిని దాని వైపునకు మరల్చదలిచాను. నేడు ముస్లింలు దాన్ని పూర్తిగా మరిచిపోయారు. ఆ విషయం ఏమిటంటే, ఇస్లాంలో పనులన్నీ సామూహికంగా చేయబడతాయి. వ్యక్తిగత పోకడకు ఇస్లాంలో స్థానం లేదు. మీరు మస్జిద్‌కు దూరంగా ఉన్నప్పుడు ఒంటరిగా నమాజ్ చేస్తే అది నెరవేరుతుంది. కాని షరీఅత్ కోరేది మాత్రం మీరంతా కలిసి సామూహికంగా నమాజ్ చేయాలన్నది. ఇదే విధంగా సామూహిక వ్యవస్థ గనుక లేకుంటే మీరు వేరు వేరుగా జకాత్ ఖర్చు పెట్టడం కూడా సరైనదే. కాని జకాత్ నంతటిని ఓ చోట చేర్చి పద్ధతి ప్రకారం ఖర్చుపెట్టటానికి కృషిచేయాలి. ఈ విషయాన్నే ప్రవక్తను సంబోధించి

"మీరు వారి నుండి జకాత్ వసూలు చేయండి" అని ఖుర్ఆన్‌లో చెప్పడం జరిగింది.

కాని ముస్లిములనుద్దేశించి మీరు జకాత్ ధనాన్ని తీసి వేర్వు వేరుగా ఖర్చుపెట్టమని ఎక్కడా చెప్పలేదు. జకాత్ ఖర్చుపెట్టే పద్దుల్లో జకాత్ వసూలు చేసే వారి జీతభత్యాల కొరకు కూడా వాటాను నిర్ణయించటం జరిగింది. దీన్నిబట్టి కూడా ముస్లిముల నాయకుడు జకాత్‌ను వసూలు చేసి దాన్ని ఓ క్రమం ప్రకారం ఖర్చు చెయ్యవలసి వుంటుందని తెలుస్తోంది. ఈలాగునే దైవప్రవక్త (సఅసం) గారి ప్రవచనం కూడా ఇలా వుంది. "మీ ధనవంతుల నుండి జకాత్ వసూలు చేసి మీ నిరుపేదల్లో పంచమని నాకు ఆదేశమివ్వడం జరిగింది". ఇదే మార్గం ప్రవక్త, ఆయన ఖలీఫాలు కూడా అవలంబించారు. జకాత్ మొత్తాన్ని ఇస్లామీయ ప్రభుత్వ ప్రతినిధులు ఓ చోట జమచేసేవారు. కేంద్రం ఆదేశం ప్రకారం దాన్ని పంచి పెట్టేవారు. నేడు ఇస్లామీయ ప్రభుత్వం లేనందున ఓ పద్ధతి ప్రకారం జకాత్‌ను ఓ చోట చేర్చే వ్యవస్థ లేకపోవటం వల్ల మీరు వేర్వేరుగా మీ జకాత్‌ను తీసి షరీఅత్ నిబంధనల ప్రకారం ఖర్చు చెయ్యవచ్చు. అయితే ఓ చోట చేర్చి ఓ పద్ధతి ప్రకారం పంపకం చెయ్యడానికి ముస్లింలు ఓ సామూహిక వ్యవస్థను నెలకొల్పే ప్రయత్నం చెయ్యడం మాత్రం తప్పనిసరి. ఈ వ్యవస్థ లేకపోతే, జకాత్‌వల్ల చేకూరే ప్రయోజనాలు ఒనగూడవని తెలుస్తోంది.

- : సమాప్తం: -